— ఓమ్ —

# లీలావతీ నాటకము.

ప్రబోధము:- పాఠశాలలం జదువేలా బాలికలకు!



శ్రీ తెన్నటి వేంకట దీక్షితులుగారు,
పెనుగొండ, పశ్చిమగోదావరీ జిల్లా.



1939

శ్రీ ధనపతి ప్రెస్, బ్రాంచి- పెనుగొండ.

☞ ఏతన్నాటక పాఠక మహాశయులు తమ విమర్శనా పత్రికల నేతద్గ్రంథ కర్త కందజేయుదురని ప్రార్థన.

శ్రీ తెన్నేటి వేంకట దీక్షితులు గారి యముద్రిత గ్రంథములు

ఓమ్

# [illegible]

అను

తత్సమాచ్ఛిక పర్యాయపద నానార్థ నిఘంటువు.

ఇది:- 1. పదము యొక్క నానార్థములు, 2, తత్పదమునకు దత్సమాచ్ఛిక పర్యాయ పదములు. 3. వ్యుత్పత్త్యర్థకము (చాలదనుక) 4. ఏ యితర పదముల యొక్క నానార్థములు నీ పద మొక టియై యుండనోపు ననువిషయము. 5. తత్పదము తత్సమ మైనచో నేమాత్పపదము నుండి యుద్భవమైనది



మునకుఁ జదువరు లేయర్థము

త్పకపద మేలింగ మందుండు

లయు యతి ప్రాసాక్షరము

ఁ గలవా యను విషయము

నొకశబ్దము నామమగు నె

సంబంధించినవాని పేళ్లు.

లు. 10. శబ్దార్థము లో

దెలిసికొనుటకు సావకాశ

చూపునది.

ను. "భాషకు నపూ

గాఁ గల మహా పండిత లిఖి

చూచు చున్నది.

శ్రీ తెన్నేటి వేంకట దీక్షితులు గారి యముద్రిత గ్రంథ మాల

ఓమ్

# దీక్షితీయము

అను

తత్సమాచ్ఛిక పర్యాయపద నానార్థ నిఘంటువు.

ఇది:- 1. పదము యొక్క నానార్థములు, 2. తత్పదమునకు దత్సమాచ్ఛిక పర్యాయ పదములు. 3. వ్యుత్పత్త్యర్థకము... (చాలదనుక) 4. ఏ యితర పదముల యొక్క నానార్థముల... నీ పద మొకటియై యుండనోపు ననువిషయము. 5. తత్పదము... తత్సమ మైనచో నేమాత్పపదము నుండి యుద్భవమైనద...



...మునకుఁ జదువరు లేయర్థము...
...త్మకపద మేలింగ మందుండు...
...లయు యతి ప్రాసాక్షరము...
...ఁ గలవా యను విషయము...
...నొకశబ్దము నామమగు నె...
...సంబంధించినవాని పేళ్లు.
...లు. 10. శబ్దార్థములో...
...దెలిసికొనుటకు సావకాశ...
...రా. చూపునది.
...మును. "భాషకు నపూ...
...గాఁ గల మహా పండిత లిఖి...

...చూచు చున్నది.

# లీలావతీ నాటకము.

—◆◆◆ ప్రబోధము ◆◆◆—

క॥ స్త్రీ, సంఘమందు, విద్యా
భ్యాసంబొందుట మఱి గృహ। బాహ్యంబందుఁగ,
వీసంబును గూడ దనుచు,
వ్రాసితి నీనాటకంబుఁ। బంచాంకములన్॥





గ్రంథకర్త
ప్రకటనకర్తయు } శ్రీ తెన్నేటి వేంకట దీక్షితులుగారు,
పెనుగొండ, పశ్చిమ గోదావరీ జిల్లా.

పరిష్కర్త:—బ్రహ్మశ్రీ పండిత దర్భా జగన్నాథశాస్త్రిగారు,
నర్సాపురం; ప॥ గో॥ జిల్లా.

 1939. వెల— రూ 0/12/0
( అంచెకూలితో )

—• ఏ త త్గ్రం థ క ర్త కు •—

## శ్రీమద్గుర్వాశీర్వాదము

(ఉ) శ్రీ రఘు రామచంద్రుఁడు ని । రీహా చిరాయువు లిచ్చి ప్రోచుత
దారియుఁ దెన్నెలుఁగని య । ధర్మ విహారుల ధర్మమార్గ సం
చారులఁ జేయలేని పగు । జన్మ మదేటికి నంచు దీక్షతో
సారవినీతి కావ్యములఁ । జక్కఁగఁ గూర్చిన దీక్షితున్, సదా
చారుని, సార్థకాహ్వయుని, । సత్కవిచంద్రు మదీయ [illegible]

1-8-39 ఇట్లు, దర్భా జగన్నాథ శాస్త్రి

---



# కృతజ్ఞత.

సాహిత్య రత్నాకర పండిత మూర్ధన్య బ్రహ్మశ్రీ దర్భా జగన్నాథ శాస్త్రి గారి సంస్కృతాంధ్ర విద్యా గురుత్వమే నాకృతులకుఁ బ్రధానాధారమై నందునకు, వారికి నామీఁదలఁ గల యవ్యాజ ప్రసాద గరిమమునకు నా సహస్రాభివాదనములు.

మఱియు శ్రీ తెన్నేటి లక్ష్మీనారాయణ శాస్త్రి, పాక రామకృష్ణశాస్త్రి, ఘండికోట సుబ్బయ్య శాస్త్రి, భేలనఘట్ల సోమనాథశాస్త్రి, చెరుకుమిల్లి సుబ్రహ్మణ్యశాస్త్రి, ఖండవిల్లి వేంకటాచార్యులు, ప్రతాప వేంకటేశ్వరులు మంచం బుచ్చలింగప్ప శతావధానులు, వేమూరి రామ గోవిందశాస్త్రి, కవికులాలంకార జవ్వాది లక్ష్మయ్య, యేల్లమిల్లి కామేశ్వరరావు, వంగల వేంకట రాఘవాచార్యులు, పరకాల వేంకట జగన్నాథమూర్తి, కొలచన నరసింహమూర్తి, వాడపల్లి రాఘవాచార్యులు, కోట నరసింహమూర్తికవి, లొల్ల శ్రీరామకవి, శిష్టా వేంకట సుబ్బయ్య, కళా సుబ్బారావు, విద్వన్మహాకవి పామర్తి సూర్యప్రకాశ శర్మ, హరి పురుషోత్తమ కవి, వేమూరి వేంకటామయ్య, గార్లీ నాటక రచనలోఁ [illegible] నందున వీరికి నా కృతజ్ఞతా పూర్వకాభివందనములు.

ఇట్లు, గ్రంథకర్త.

## కృతికర్త యొక్క మాతా సుతలు.



వందే మాతరమ్.

 అంకితము. 

తే॥ గీ॥ బడుల—చదువులు పడఁతులఁ । బాడుఁ జేయు
ననుచు నేర్పు నీనాటకం । బతుల భక్తి
భారతీయ పతివ్రతా । భవ్య మణుల
కంకితముఁ జేసి ధన్యత । నందు వాఁడ॥

గ్రంథకర్త.

## — ఈ నాటకము నందు వచ్చు పాత్రలు. —

### పు రు షు లు.

శంభుదాసు— కథానాయకుఁడు;
శంకర శాస్త్రి— నాయకుని తండ్రి;
పెద్దిభట్లు— నాయిక తండ్రి;
భద్రుఁడు— పెద్దిభట్లుగారి నర్మ సఖుఁడు;
కామశాస్త్రి— నాయిక యొక్క విటుఁడు;
బహాద్దూర్ బాదు యువకుఁడు, ప్రభ్యుఁడును.

సంభావన బ్రాహ్మణులు:— సుబ్బావధాన్లు; భోగన్న శాస్త్రి; వీరావ ధానులు: సూరావ ధానులు; కామావ ధానులు; వేంకటావ ధానులు; మున్నగు వారు.

### స్త్రీ లు.

లీలావతి— కథానాయిక;
సోమిదమ్మ— నాయికయొక్క తల్లి;
గున్నమ్మ— నాయకుని తల్లి;
విష్ణమ్మ— విరసపుర విశ్వస్త.
చెలికత్తె— నాయిక యొక్క చెలికత్తె;
దాసీ— ,, ,, దాసి.

పుష్పావతి, దమయంతి, కమలావతి, కుసుమావతి మున్నగు వారు— } నాయిక యొక్క పుట్టింటి యిరుగు పొరుగు స్త్రీలు.

*
* *

## —◆ ఓమ్ ◆—

# లీలావతీ నాటకము.

(ప్రబోధము:— పాఠ శాలల చదు వేల । బాలికలకు?)



(ప్రవేశము:— నటీ సూత్రధారులు)

### నాంది

ఉ॥ ధర్మము నాశమౌ తటిని । దాంభిక విద్య సతుల్ పఠించి దు
* ష్కర్మరతులై కులోచితపు । గౌరవ ధర్మము లెల్ల మాపగా
ధర్మము నిల్పి మానవుల । ధన్యులఁ జేసెడి కృష్ణమూర్తి స [తన్
త్కర్మ విలోల సభ్యుల సు । ఖంబు లొసంగుచుఁ బ్రోచుఁ గావు

(నాంద్యంతమున)

సూత్ర:— సఖీ! ఇటు రమ్ము.

నటి:— నన్నుఁబిల్వ గతం బేమి?

సూత్ర:— నూతన నాటక ప్రదర్శనము వలనను మోదముల ను జిగురింపఁజేయు నీగానామృతము వలనను సభ్యుల కానంద ముఁ గలిగించుటకు.

నటి:— తమ రాడించుటకు నుద్యమించు కొనిన నాటక మెద్ది? కవి యెవరు?

---

* "ద్వావింశతి పదా నాంది" అను నియమంబున నిరువది రెండు పదంబులతో నాందిపద్యము విరాజిల్లును నాటకభావ సూచనఁజేయును.

సూత్రి:— సకల కళావిదులు రస విచారణ దక్షులు, కావ్య నాటక ప్రకటన చాతురీ ఖనులు పండిత వర్యులు నగు నీ సభా సదుల కెల్లరకుఁ, బ్రీతి నొనర్చుటకై, నిర్దుష్ట భాషా శుద్ధిఁ గలిగి మృదు మధుర శైలిం దగిలి మనోహర గద్య పద్యములతో, సనాతనాచా రామోదకులు నాంధ్రభాషాభిమానులుం దీక్షితీయ మను తత్సమాచ్ఛిక పర్యాయ పద నానార్థ నిఘంటువు, వార్యోక్తి మంజరి, కవి కరదీపి కాద్యనేక గ్రంథ కర్తలు నగు శ్రీ తెన్నేటి వేంకట దీక్షితులు గారిచే రచియింపఁ బడి, శాస్త్రజ్ఞులు ఏమగ్న కాగ్రేసరులు నగు బ్రహ్మశ్రీ పండిత దర్భా జగన్నాథ శాస్త్రి గారిచే పరిష్కృత మైన లీలావతీ నాటకము మన మిప్పు డాడనై యున్నాము. ఇందు:—

ఉ॥ శ్రీ కమనీయ రూప గుణ । సింధుల దాన జపాగ్ని హోత్రులన్
ప్రాకట శంభు దాసులగు । వారిని గూడి సు ఖాబ్ధిఁ దేలఁగా
లేకయ, కామ శాస్త్ర గురు । లీల యథేచ్ఛ సు ఖైక భోగమున్
మేకొనుచున్ వివేకమును । మీఱి నశింతురు మాన వాధముల్!.

అను నది గలదు.

నటి:— ఆర్య పుత్రా! మీరు మహా కవులు; మీ గంభీర వాక్యముల బాహ్యార్థమే కాని యంత రార్థము బోధపడ కున్నది. తేటఁ బలుపుఁడు.

సూత్రి:— ఈ లీలావతీ నాటకము లో

నాయిక— లీలావతి; ఈమె పాఠశాలా విద్యచే స్వేచ్ఛా విహారాదులు గలిగి చెడినది.

నాయకుఁడు:— శంభు దాసు. పవిత్ర మూర్తి. సనాతనా
చార ధర్మపరుఁడు.

లీలావతీ విటుఁడు:— కామ శాస్త్రి.

సమస్తము రూప గుణ సింధువు, దాన జపాగ్ని హోతుఁ డు, నగు శంభు దాసుతోఁ గూడి యిహపర సుఖాబ్ధిని దేలగా లేక కామ శాస్త్రిని 'లీల' యను నామె యథేచ్ఛ సుఖైక రతికై కూడి చరించి నింద్య యయ్యెను.

నటి:— స్త్రీ విద్యా నిరసన భావ మిందిమిడి న ట్లున్న దే!

సూత్రి:— స్త్రీ విద్యను నిరసింప లేదు. కనుకయా యపోహ మునుచు కొనకు; భారతీయ జననీ జనకులకు,

'పాఠ శాలల చదు వులా! బాలికలకు!' నను ప్రబోధము చక్కఁగ హృద్గత మగు న ట్లీనాటకము ప్రదర్శింతము.

తే॥ గీ॥ తన సుతకుఁ బెద్ది భట్టులు। దగిన వరుని
కొఱకుఁ దిరిఁగి తిరిఁగి భార్య। కుఁ దెలుపంగఁ
దొందరగ వచ్చు పోలికఁ। దొలఁగ వలయు
మనము నిట నుండి వేగమె। మాన్య రాల!

(నిష్క్రమణము)

— ఓ మ్ —

# లీలావతీ నాటకము

## అంకము 1 — రంగము 1

పెద్ది భట్లు గారి యిల్లు

ప్రవేశము:— పెద్ది భట్లు, సోమి దమ్మ (లీలావతి యొక్క జననీ జనకులు) భద్రుఁడు— (నగ్మ సఖుఁడు)

పెద్ది:— ఓసీ!

ఉ॥ పుత్రిక లే దటంచుఁ గడు । బొక్కెడు! కల్గిన దాది, గాథహా
యాత్రము నొందు చుండ మొకో । యల్లుఁడెవండగునంచు? దేశముల్
పాత్రు నిమిత్తమై తిరిఁగి । భామిని! యారయ నైతిఁ; గట్నముల్
చిత్రముగాఁ బెరింగె; నిఁక । జేయఁ గలార మె లీల పెండిలిన్?

సోమి:— వరుఁడు పుట్టియె యున్నాఁడు, కాని ఘటనకా లము వలయుఁ దెర చాటు.

పెద్ది:— కం॥ ఒకఁ డిక్కడఁ గలఁ డని మఱి
యొకఁ డక్కడఁ గలఁ డని విని । యోర్మిని వెదుక న్
ఒక లోటు లేని వరుఁడు క
లికమున నైనఁ గనఁ బడఁడు । లీలావతికిన్॥

సోమి:— 'పరువు! పాత్రత!' యనుట తోడనే సరి పోవు చు న్నది మీకు!

పెద్ది:— అ దేమన్న మాట! 'యది కించి ద్వరే దోషః
కిం ధనేన కులే నకిమ్!

అనగా కం॥ వరునకుఁ గించి ద్దోషము
దొరలినఁ గుల ధనము లున్న । దూషితుఁడె యగున్;
వరుఁడు వియాతుఁ డయిన చోఁ
బరకించెద నంత గోత్ర । భాగ్య కు లాదుల్॥

సోమి:— ఆంగ్ల భాషా పారఁగతుఁ డైనచో సమాదరణీ
యుఁ డగుఁ గదా యీ దినములలో!

పెద్ది:— సీ॥ ఆంగ్ల భాషా ఽ భ్యాస। మాచరించిన వెంటఁ
గ్రాపింగు షోకులఁ । గాంతు నొందు
ఆచార కర్మంబు । లడుగంటఁ జేయుచు
సతతంబు వ్యసన సం । చారుఁ డగును;
భావ శుద్ధి నొసఁగు । భవ్యంపు సంధ్యను
వార్చ రా దనుచును । వదరు చుండు;
జనకుని తిథి నైన । సమయంబుఁ గడఁ ద్రోచి,
పెట్ట నాలోచించుఁ । బెఱ దినమున

ఆ।వె॥ మాతృ భాష కంటె। మఱి మఱి మేలంచు
నాంగ్ల భాషఁ జదువు। నతఁడె నూవె!
మనకు మేలు వాఁడు। ననుచు ననకు;
వాని కిన్న డీయ। పడఁతి మిన్న॥

సోమి:— గౌరవ ప్రపత్తులు గల వా రట్టి వారే కదా
యిపుడు!

పెద్ది:— 'న దుఃఖం బహు భిన్నహా' అనియా నీ యాలో
చన?

(ఉ) కానమె! వేత నార్థములు । గౌరవ మంచును నెంచి యుండుటన్,
శానిస వృత్తి నుండుదురు; । పావన శాస్త్రము విక్రయింపకన్,
జ్ఞాన విశేష మాన్యులయి । సజ్జను లౌచును గీర్తి నొందరే
మానము ధార వోయుదురె । మాన ధనాఢ్యులు లేమి నొందియున్?

సోమి:— గోపాద మంత జుట్టు పిలక, చలిమిడి ముద్ద వోలె ముండనము, పదలం విభూతి పూంత, నీర్కావి ధోవతులు, బిళ్ల కచ్చడములు, పొడుము బుఱ్ఱ, బుఱ్ఱ ముక్కు, మటికల యంగ వస్త్రములు, స్నానాలు మడులు సంధ్యలు, ఆచార వ్యవహారములు, ఇషే త్వాది పనసలు, నిష్కపట వాక్యా లు, జన్నిద దారముల తాల్పులు, అపరాహ్ణ భోజనములు, ని త్యాగ్ని హోత్రములు, ఇష్టులు, చకారాంత వాక్య ప్రయో గములు, మొన్నగునవి గల ఛాందసులు మీకు నచ్చితే సరియా!

పెద్ది:— క్షణ భంగురములగు పరదేశీయుల వేషములను ధరించి మేడి పండు వలె నెట్టగా బుట్టగాఁ గనఁ బడు పిల్ల వా ని నల్లునిగ స్త్రీలు స్వీకరించెదరు గాని కల్పాంత స్థాయి యైన గుణసహితుండై స దాచార సంపత్తి గల పిల్ల వానిని గోరరు గదా! 'కాంతా జనే ధృష్టతా' యను న్యాయము నీ పట్ల నిజ మైనది.

భద్రి:— వైదికు నాక్షేపించని లౌక్యుఁడు లౌక్యుడు గాఁడు. సిగ రెట్టు మీఁద సిగ రెట్టుఁ గాల్చని విద్యార్థి విద్యార్థి గాఁడు. క్రాపింగు లేని తల తల గాదు. కాఫీ త్రాగని నోరు నోరు గాదు. అత్త మామల నేడ్పించని యల్లుఁ డల్లుఁడు గాడు, కో

డలు గోడలు గాదు; చౌకార్ల లతో నన్నుమః దినని నాగరికుఁ
డు నాగరికుఁడు గాఁడు. ఇప్పటి యంద చందము లివి.

పెద్ది:— ఓసీ! 'సుందరం పురుషం దృష్ట్వా - -' అను నట్లింత యింతికిఁ గను వేదురు తగునా?

సోమి:— పోనీయండి! మీ దృష్టిలో నెవరో యున్నట్లున్నది.

పెద్ది:— శా॥

ఓసీ! నీ పలుకుల్ నిజంబు వినవే! యుత్కృష్ట వంశంబునన్
వాసిం బుట్టెను శంభు దాసుఁడను సుబ్బాలుండు, హేమాంగుఁడున్,
కాసం బైనను దీసి పోఁడు సుమతిన్; కావ్యానుసంధానముం
జేసెన్; ధర్మ సుకర్మ వీక్షకుఁడు, డాసెన్ పోడశ ప్రాయమున్.

సోమి:— కుల ధన యౌవన విద్యా బుద్ధి మంతుఁడే గదా మన ముపలక్షించునది!

లీలా:— (ప్రక్క గదిలో నుండి) భద్రా! (అనిపిలుచును) (భద్రుఁడేగును) నా తలి దండ్రు లేమిటో యాలోచించు చున్నారు?

భద్రి:— నీ పెండిలిని గురించియె. నీచెక చెకలు, నీ చదువులోని మెలఁకువలు, నీ పాఠశాలానుభవములు నీ మనోభిలాషలు దెలిసిన మీ యమ్మ గారు నీకీడైన వరుని జూడవలె ను చుండ, సనాతనాచార ధర్మ సభలలో నగ్రాసనాధిపత్యము వహించుటకు నర్హుఁడగు వానికి మాత్రము నిన్నియ్యవలెనని యనకట్టిన ట్లయ్యగారనుచుండిరి.

సోమి:— చూడండి! లీల ప్రాజ్ఞత వచ్చినదే కదా! ఆమె

తో( గూడ......

పెద్ది:- సంప్రదించుటా! తమ వివాహ సంబంధములను గురించి వధూ వరులతో సంప్రదించుటా! వీరలు పిన్న వయస్కు లయినచో 'నశ్యతి కార్యం బాల నాయక' మను న్యాయమున లోక జ్ఞాన విహీనుల్య లస్థిర చిత్తు లగుటచే గుణావగుణావలోకనము( జేయ లేరు. కనుక సంప్రదించుటకు (దగినవారు గారు. యుక్త వయస్కుల రైనచో, 'కామాంధానాం యుక్తా యుక్త వివేక శూన్య త్వా' త్తను న్యాయమున కామాంధులు యుక్తా యుక్త వివేక శూన్యులై కుల భ్రష్టత్వము వాటిల( జేసియు నైన( దమ తాత్కాలిక వాంఛలను దీర్చుకొన( జూతురు. కనుక సంప్రదింపూ గింప్రదింపూ కట్టిపెట్టు. "స్త్రీ బుద్ధిః ప్రళయం కరీ" యందురు. రూపమున రంగులు పేర్చిన రావణు విగ్రహమును లీలావతి పెండ్లి యాడెద ననిన నేను సంసిద్ధు( డను గావలసిన దేనా? పోయి, నీపని( జూచుకొనుము.

(సోమి: నిష్క్రమించును.)

భద్రా! ఇటు రమ్ము! (భద్రుడు ప్రవేశించును.)

రేపు శని వారము. కం॥ మే లనె నుషస్సు గార్గ్యుడు,
మే లనె శకునంబు గురుడు; మేదిని హరియున్
మే లనెను విప్ర వాక్యము;
మే లనె మాండవ్యు( డాత్మ। మెచ్చిన వేళల్॥

అందులో శని వ్యాఘ్రము మఱీ మంచిది. కనుక యప్పుడు

లేచి మన ముభయులము విరస పురమున కేగి శంకర శాస్త్రి గారి కుమారుఁ డగు శంభు దాసుని జూచి వీలును బట్టి సంబంధమును స్థిర పఱచి వత్తము. (నిష్క్రమణము.)

---

అంకము 1—రంగము 2. విరస పురము. శంకర శాస్త్రిగారియిల్లు.

ప్రవేశము:— శంకరశాస్త్రి గారు, పెద్దిభట్లు గారు, భద్రుఁడు.

పెద్ది:— స్వాధ్యాయులమై విద్య నభ్యసించుకొను నప్పుఁడొంత నంటి యుంటిమో తరువాత నంత వీడి యుంటిమి.

భద్రు:— తండ్రులయి మఱల నంత నతుకనై యున్నారు.

శంకర:— నేడు సుదినము.

భద్రు:— మీ కుల దీపకుఁ డెక్కడ?

పెద్ది:— శ్లో॥ పాత్రం నతాపయతి నైవ మలం ప్రసూతే స్నేహం నసంహరతి నైవ గుణాన్ క్షిణోతి। ద్రవ్యావ సాన సమయే చలతాం నధత్తే సత్పుత్ర ఏష కుల సద్మని కోపిదీపః॥

భద్రు:— అన తాత్పర్య మేమో సెలవిండు.

పెద్ది:— దీపము పాత్రను దపింపఁ జేయును. మలముఁ (కొడిని)గనును. స్నేహము (చమురు)సంహరించును. గుణమును (వత్తిని) క్షీణింపఁ జేయును; ద్రవ్యావ సాన సమయమున (వత్తిచమురులగు సరికి) చలత్వమునుఁ జెందును.

సత్పుత్రుఁ డన్ననో పాత్రుని దపింపఁ జేయఁడు; మలముఁ (పాపమును) గనఁడు; స్నేహమును (మైత్రిని) సంహరింపఁడు; గుణమును (సద్గుణములను) క్షీణింపఁ జేయఁడు; ద్రవ్యావసాన

సమయమునను చలత్వము నొందఁడు.

ఇట్లు వీరి పుత్రులకుఁ బోలిక దీపము చాలదు. కులమను గృహమునకు విలక్షణ దీపము.

శంకర:- పెద్దల యాశీర్వచనము. మా యబ్బాయి నీ శిసువ్యావమందు పిన తండ్రిగారి కడకు, నాకుఁ గొన్ని తొందర పనులుండి, పంపితిని. మా కృష్ణ శాస్త్రిని మీ రెఱుఁగరూ!

పెద్ది:- 'యథా పితా తథా పుత్రః'!

భద్రు:- ఈ దినములలో నూనా?

పెద్ది:- మీ యబ్బాయి బ్రహ్మ చర్యాశ్రమములోనే నేర్వఁ దగిన విద్య లన్నియు నేర్చి శిష్టాచార సంపత్తిఁ గల వాఁడయ్యె నని విని నాకుమార్తె నాతనికిఁ దథాస్త్వితి యనుట కువచ్చితిమి.

శంకర:- మొన్న మా పురుషోత్తము తన కూఁతుని నొక యాయవారపు వాని కియ్యఁ బోగా 'సింగన్న చెంబు కంటెఁ దనది పెద్దది. సింగన్నకు వెయ్యిన్నూట పదారులు గట్న మిచ్చిరి. తన కెంత యెక్కువ నిచ్చెదరో తెలుపుఁ' డనెను; కనుక యౌవన రూప కుల ధన విద్యాధికములు గల మా వాని కెంత కట్న మర్హమో యోచింపుఁడు.

పెద్ది:- కట్నము లెక్కువగాఁ బెరిగినవి.

భద్రు:- పెరుఁగుటే విఱుఁగుట కొఱకె! శారదా యమ్మ కడుపు చల్లగా విఱుఁగు చున్నవి.

శంకర:- కాని యె న్నెన్ని సంబాధములు వచ్చిన నే న్నె

న్ని కట్నము లెఖవేసినను, నేను (1) సనాతనాచార ధర్మా మోదకుఁడ నగుటను, (2) నేఁ గనిన వాని నితరులు బోషించుటకు నొల్లని వాఁడ నగుటను, (3) తల్లి గనియుఁ బెంచునది యేనా యని కట్న మిడు వారి విమర్శనలకు మాయింటి యాబిడను బాటిఁ జేయుట శిరచ్ఛేదముగఁ దలఁచు వాఁడ నగుటను (4) ఆయు ర్విత్తాదులు మానవులకు గోప్యంబు లగుటచే నా విత్త సత్యమును నేఁ దెలుప నొల్లమికిని, సత్యం బితరులు దెలియ లేమికిని, నా యర్హత కన్న నెక్కువగాఁ గన్యా ప్రదాత గట్న మిడగ, బుద్ధి మాలి, నే నందుకొను నంత బూటకము నకు నొడిఁ గట్ట నిష్టము లేని వాఁడ నగుటను, (5) వధువు యొక్క జననీ జనకుల సాంప్రదాయములను ముఖ్యము గా నరయు వాఁడ నగుటను, (6) ఉన్న యొక కొడుకు నమ్ము కొని యిహ పర గతులకు జూరుఁడ నగుటకు సంసిద్ధుఁడఁ గా కుంటను మున్నగు సంకోచములచే ముభావముఁ దాల్చితిని. కట్నమున కేమి లెండి! నే సంపాదించినది చాలదా! తానుదిన వచ్చు నెందఱి కైనఁ బెట్ట వచ్చును.

"స్త్రీ విత్త మధమాధమ" మందురు.

ధనము సంక్రమించెడు నే స్త్రీని బెండ్లాఁడిన యే భర్త మనశ్శాంతితోఁ గాఁపురముఁ జేయు చుండెనో వ్రేలు మడచి చూపుఁడు.

పెద్ది:— తనకుఁ దెలియని ధర్మమేది యున్నది?

శంకర:— ఓపిక పట్టిన బాలికకు రూకల రొట్టె దొరకి నట్లు

నాకుఁ దమవంటి వారితో వియ్యము సంప్రాప్త మైనది. మొన్న పత్ర పురములో మీ పిల్లను జూడఁ దటస్థ మైనది.

పెద్ది:— అది యామె మేన మామగారి యిల్లు; అక్కడకు నీ మధ్య వెళ్లినది.

శంకర:— గగన కుసుమ మప్రయత్నముగ లభ్య మైనప్పుడుఁ గా దనుట 'సిద్ధ మన్నం పరిత్యజ్య భిక్షా మటతి దుర్మతి' యను న ట్లగును. పిల్లయే కట్నము. కాని కాకి పిల్ల కాకికి ముద్దు; మా వాఁడు మాకు ముద్దు; మీరొక మాటు చూచు కొనవద్దూ!

పెద్ది:— తనుదే భారము.

శంక:— పిల్ల పే రేమిటి?

పెద్ది:— జాత కర్మ నామకరణముల యానుమతిఁ దప్పించితిని. ఇరుగు పొరుగు వారు 'లీలావతి' యను ముద్దు పేరుంచిరి.

శంకర:— సంబంధము స్థిరము. ముహూర్త ముంచుఁడు.

పెద్ది:— ఈ ఫాల్గుణ శుద్ధములో మంచిది యున్నది. మాకా! వ్యవధి సరిపడును.

శంక:— ఈ మాఘ శుద్ధములోఁ గాని మొడల ఈ సంవత్సరములోఁ బడదు.

పెద్ది:— 'శుభస్య శీఘ్ర' మందురు. ఈ శుద్ధ విదియను స్థిరపఱచు కొనుదము.

శంక:— వంట లయినవి.

పెద్ది:— కలికిన సతుకదు; పెగా వ్యవధి చాలదు, సెలవిండు.

భద్రు:- (పెద్దిభట్లుతో) కట్న మక్కఱ లేదనిరి; వ్యవధి నొప్పు కొనకుండిరి. మనమూ! వరుని జూడలేదు. ముహూర్త మంచిరి.

(పెద్ది భట్లు భద్రుఁడు నిష్క్రమింతురు.)

ప్రవేశము— గున్నమ్మ— (శంకర శాస్త్రి గారి భార్య.)

శంకర:— తలి దండ్రులు సత్కులీనులు. పిల్ల మతాబా. ఎన్నో క్లాసులు ప్యాసైన దట. సంగీత సాహిత్య విద్యలలోఁ బోటీ లేని దట. కనుక పెద్ది భట్లు గాగి కూఁతు రగు లీలావతిని చి॥ మన యబ్బాయికి స్థిర పఱచితిని. ఈ మాఘ శుద్ధ విదియకు సుముహూర్తము.

గున్నమ్మ:-- పాఠ శాలలలో నాఱి తీరిం దనుచున్నారు. చెప్పిన మాట వినిమన కుపచరించునది గావలయును. గొంతుకలో నీళ్లు పోయునది కావలయును. బాలికలు పాఠశాలల కేగుట వలన ఫలము గృహాచారములను నశింపఁ జేయుట కే కాని ధనార్జనమునకుఁ గాదు. పూట కూళ్ళ యింట భుజించుట కొల్లని వారు గదా యతి థ్యభ్యాగతు లగుట. పూట కూళ్ళ లోని హీ నాచారముకంటెహీనతరాచారము గృహిణికిఁగల్గినచో నాతిథ్య మాయింటఁ గొనుటకు నేయతిథి యొప్పుకొనును? పాఠశాలలఁ జదువని స్త్రీ తన తలితండ్రుల యత్తమామల స్థితి గతుల ననుసరించి వర్తించును. తండ్రి యింట రాజ వైభవము ననుభవించు చుండిన ద్రౌపది, పాఠశాలలకు బోవని కతమున, తిరిప మెత్తుకొను భర్తలు దొరకి నందున వగవక, వివాహమైన మఱు

నాఁడే యాపరి స్థితులకు నిమిడిన దయ్యెను. వేడ పోగు చేయు బాలికలు కౌపీనములు ధరించెదరు. పాఠశాలల కేగు బాలికలో! ముందు తలితంఁడ్రులను, తరువాత యత్త మామ మగలను బీడించి పీడించి తమ షోకులను సాగింపఁ జూచుకొను సీమకు క్క—పిల్లలు. వేష భాషలకు ముందు అక్క—అ పనులకు వెనుక.

శంక:-- శుభం పలుకరా మంకెన్నా యఁదురు. లేని పోని కళ్ళంకలు పెట్టు కొనకుము. దురాచారములు పెద్ది భట్లు గారి యొద్ద సాగునా?

గున్న:— మీా వియ్యపు రాలివి సంఘ సంస్కర్తృ పు టూహ లేమో! కాకున్న లీలావతి పేరేమిటి బ్రాహ్మణ కులము లోఁ బుట్టిన పిల్లకు?

ఎవని పే రీలోకములో నెంత కాలము స్మరింపఁ బడునో యంత కాలమువాఁడుస్వర్గవాసియగునని కులపెద్దల పేళ్ళు పిల్లల కుంచెదరు. లేదా, సర్వదా స్మరించుటకు ననువుగాన, దేవుల పేళ్లుంచెదరు. ఎవరి నుద్ధరించుటకుఁ దన కులముున కెక్క—డా లేని యా పేరు పెట్టినది?పోసీ! యర్థముతోఁ గూడిన పేరే యగునెడ నాకు మటీ భయము.లిని కూర్చుండి గోళ్ళుకొఱుకు కొనుచు లీలలను రక్షించు నది మన కక్క—అ లేదు. సనాత నాచార గృహిణి గావలయును గాని.

శంకర:— గట్టిగాఁ బట్టు కొన్నావే!

గున్నమ్మ:— ఇం కొక మాట. 'స్వ ఛార్యా యాంచ యా

వన' మని మా నాన్న గా రనుచుండెడి వారు కొడుకుతో! పర దారలు మాతృ వతులు, పర పురుషులు పితృ భ్రాతృ సములు. కనుక స్త్రీల పేళ్లమ్మలతోను పురుషుల పేళ్ళన్న యయ్యలతోను ముగియును. కనుక భార్యా భర్తలొండొరులను పేళ్ళతోఁ బిలువ కొనరు. వేశ్య కాంతలు సామాన్య నాయికలు. వారి పేళ్లట్లు ముగియవు. లీలావతీనామము సానిపేరా? సంసారిపేరా? ఈబడులెక్కువైనకొండిబాలికలలో పుష్పములు, పద్మములు, కమలములు లీలలు దిబ్బలు తిరు గుండము లు వీనిని రక్షించు వారే కాని శ్వశ్రూవతి, శ్వశురావతి, పిత్రావతి, మాత్రావతి, పత్యవతి మున్నగు యువతులు కలరైరి.

శంకర:-- అ దేమీ కాదు. వారి యిరుగు పొరుగు వారు లౌక్యులు. వీరికి పాతరోత, క్రొత్తవింత. నాము కరణానుమతిఁ దప్పించు కొనగా వా లాపేరు పెట్టిరట.

గున్నమ్మ:— బాలిక

కం॥ తొడుగును గజ్జల లాగులు,
తొడుగును చంకల గవునులు । తొడలను జేరన్;
పెడ పాపిడి దిద్దును; దిగ
విడుచును లజ్జ; బడి యందు । విద్యార్థినియై.

శంకర:-- నీ మాట లన్నియు గొట్టి వేయ రాదు. పెద్దమనిషి యగువఱకు, పరికిసీలను (పావడలు) ధరింపక, కుంటి గంతు, ఒయ్యారి భామ, వానా లప్ప, బుప్పుల గుప్ప మున్నగు బాలిక లాట లాడక యుండెనేని, స్త్రీకిఁ బ్రసవ వేదన లెక్కువ

యుండు నందురు. చూడు! డాక్టర్లెక్కువైరి. వీరితో పాటు మంత్రసానులు. కనుక బాలికకు లాగు నిందాస్పద మైన దనుకొనెద. తరువాత స్త్రీలు గూడ కట్టుఁ గట్టిన లోకులు నవ్వెదరు. పాఠశాలల పోకులు మన కడనా మన కోడలికి సాగునవి? తిన్న నగును. భయపడకు. హార్మోని ఫిడేలు కొయ్యలు,సిల్కు బూట్సు గొడుగులు, చైనాసిల్కు ఓణీలు, జడ రిబ్బనలు, చేతి రుమాల్లు, ఫేసు పౌడరు డబ్బాలు, పెడ పాపిడులు, వీని, నన్నిటిని మన యింటి వరకూ కూడాకాదు పొలు మేర దాటి కూడ రానీయను.

గున్నమ్మ:— చూచెదనుగా! (నిష్క్రమణము)

---

అంకము 1 — రంగము 3

పెద్ది భట్లు గారి వీధి యరుఁగు. సంధ్యా సమయము.

ప్రవేశము: సోమి దమ్మ; ఇరుఁగు పొరుఁగు స్త్రీలు,

సోమి:— కమలావతీ గారు! మా లీలకుఁ బెండ్లి గుదిరినది. విరస పురము.

పుష్పావతి:— మనలీల గాపురమున కేగువటకే విరసపురము.

ప్రవేశము—,విఘ్నమ్మ. (ఒక ముసలి విధవ.)

సోమి:— ఎవరి నమ్మా! తిట్టుచూ వచ్చు చుంటివి?

విఘ్న:— ఏమి చెప్పనా! వాని తల పండగల! చూడండి! మా యూరి సత్రపు గుమా సాను! మాది విరస పురము;

చీఁకటి పడినది. వెళ్ల లేను. చోటి మ్మంటే లే దన్నాఁడు.

సోమి:— పోనీ లెండి. ఈ రాత్రికి మా యింట నాగుఁడు.

విఘ్న:— ఒక్క నిమిషమైనా యాగను. వాని ప్రాణాలకు నుసూ రని పోచును. నా యీసురు వానికిఁ దగుల వలయునుగా!

సోమి:— మీ యూరులోని శంకరశాస్త్రిగారి కొడుకునకు మా యమ్మాయిని తథా స్త్వతి యన్నాము. రండు! చెప్పెద!

విఘ్న:— అబుద్ధానికా! (విస విస నడచి పోవును)

(విఘ్నమ్మ—నిష్క్రమణము.)

(పరివేశము. పెద్దిభట్లు గారు. భద్రుఁడు.)

కుసుమావతి:— చాలును లెండి! కాశీ వెళ్ళి యేదో తెచ్చినట్లు తిరిగి తిరిగి తెచ్చిరి సంబంధము నేక లేక కలిఁగిన పిల్లకు!

సోమి:— వరుఁడు నికా రాఁగుఁ డట! (పెద్ది-సిద్ధాంతి వరుండును.) లీలా! లీలా! పిలిచినను బలుక వేమ! నీకే సరియైన వరుఁడు దొరకిన నసలే మూటాఁడవు.

(భద్రుఁడు లీల కడ కేగి)

భద్రుఁడు:— పెండ్లి కొడుకు నికా రాఁగుఁ డట! ఆయూరి యామే చెప్పినది. చిన్నప్పటి నుండి మొఱుఁగు నట!

లీలా:— నే వింటిని.

ఆ॥ వె॥ చిన్న నాట నుండి। నన్ను గారా మిండి

తల్లిఁ దండ్రు లకట! । తగిన వరుని

వెదుక లేక తుదకు । వికృత శరీరుఁ డౌ
నిట్టి వాని కియ్య । నెంచు కొసరి॥

భద్రు:-- నా కడుపు తఱుగు కొని పోవు చున్నది. ఏమిసేతును?

లీలా:- క౦॥ హా దైవమ! సూపము సరి
సాదం బుండదు గద! మఱి । సాదము సరికిన్
మోదం బగు ప ప్పుండదు;
భూదేవి దలంప దేల । పుత్రిక బాధల్?

భద్రు:- సీ॥ నీ రూపు నీ విద్య । నీ యలంకారముల్
బూడిదఁ బన్నీరుఁ । బోయు టయ్యెః
పాప మటుందురు । బైట నిన్నుఁ గనంగ;
జాలి బొందుము చుండు । జనుల కెల్ల;
అట్టి వానిని వివా । హ మగుట కంటెను
కన్యగా నుండుట । కరము మేలు;
శృంగార కావ్యముల్ । శృంగార చేష్టలు
దాని కొఱక నీకు । దాఁపరించె!

ఆ। వె॥ సిగ్గు పడగ నేల? । చివ్వనఁ బడవేయు
తండ్రి చెవినో లేక । తల్లి చెవినో!
వల దతండు నాకు । వలదు వల దటంచు
నోరు తెఱచి నీవు । నొక్కి చెపుమ!

లీలా:- సీ॥ పాపిడి దిద్దుడు । పైకిను లెక్కుడు
సొగ సైన బాలురఁ । జూడ కుండ,
నెక్టయి కొలర్లు । నిక్కర్లు దాల్చుచు
[illegible]

నా దయఁ గోరుచు । నా కన్ను సన్నకై
　　కాఁచుకుండిన వారిఁ । గాన కుండ,
నిన్న దాఁకను నాదు । నీడయై వర్తించు
　　చెలి కాని నింతైనఁ । జేర నీక,

తే॥గీ॥ పుస్తకం బన్న నెట్టిదో । పోల్చ లేని
శుద్ధ వైదిక వేషుఁడౌ । శ్రోత్రియునకు,
లీల యైన నన్ను నిడుట । పూల దండ
దున్న మెడకుఁ జుట్టుటె యని । తోఁచ కున్నె!

(తల్లి కడ కేగి. తల్లితో)

కం॥ అమ్మా! నే న్నిమ్మెప్పుడు
నమ్మిన కూఁతురను; ముంచి । నను దేల్చిన మీ
రిమ్మహిని దిక్కు సుండీ!
పొమ్మనఁ బోయెదను మీరు । పొమ్మను వరుతోన్॥

భద్రు:-- తెలివి యంటే య ట్లుండ వలయును తల్లి యెడ విధేయతను జూపుచు వరు నెడ విముఖతను వెల్లడించినది యొక్క ముక్కలో!

సోమి:-- మీ నాన్న గారు వినే వారు గారు. నయ్యయో గొయ్యియో చూచు కొన వలసినదే!

పెద్ది:-- (స్ఫురణ దెచ్చి కొని) ఎవ రన్నారు?

సోమి:-- విరస పురపు విశ్వస్త యొకతె.

పెద్ది:-- ఈ రాత్రికి నాపక పోతివా?

సోమి:-- ఎంత బ్రితి మాలి కొంటిని! సనేమి యనినది.

పెద్ది:-- కొమ్ములను జూచి నీట నున్న గేదెను బేర మాడి

నట్లుఁ జేసితిని. భద్రుఁ డనుమాన మప్పుడే సూచించెను.

కౌని. క॥ ఈ సంగతి నిజమొ! దగా
వేసంబు విరోధి దాల్చి । ప్రేలెనొ యెటులున్!
ఓసి! విచారింపఁ దగును;
వీసంబును దొందరఁ బడ, । వీలులు దప్పున్॥

ఆమె సాయంతనమున వచ్చె నఁటివే! అంత చీఁకటిలోఁ బడి పోవుట కేమి మునిఁగి పోయినది? మంథర వలె నీరవంత ముక్క నంటించి పోయినది!

సోమి:- 'పరికించెద నంత గోత్రి। భాగ్య వు లాదుల్' అని యానాఁ డనియు నింకను నూగిన లాడెద రేలా!

క॥ మనకా యా వరుఁడు? కబురు
నెను వెంటనె,సంప రేల? । వింటిరె! జాగుల్
మనకుఁ దగవు; లీలావతి
మనతో నుడువఁగఁ దలంచె । మనమునఁ గ్రుంగెన్॥

పెద్ద:- బాగు! ఇంటి లోను వీధి లోనూ ఏక గోలయె! భద్రా! ప్రస్తుత మీనుముహూర్తమునకుఁ బెండ్లిని విరమింప వలసి వచ్చి నట్లు వ్రాసితిని. దీనిఁ బంపుము.

(నిష్క్రమణము)

---

అంకము 1- రంగము 4.

—♦ శంకర శాస్త్రి గారి యిల్లు. ♦—

ప్రవేశము:- శంకర శాస్త్రి గారు; (భార్య) గున్నమ్మ.

శంక:- ఎంత యవ్వవధిగ ముహూర్త ముంచిన నేమి?

ఆ॥వె॥ కన్నుఁ నాప లేము । కల్యాణమును నైన,
తార రాక మునుపుఁ । దలఁప లేము,
ఎగుర వేయు బంతి । యెందాఁక నిల్చును?
పౌరుషం బొకటినిఁ । బను లగు నొకో!

"ఏవం పురుష కారేణ వినా దైవం నసిద్ధ్యతి" అనగా
ఆ॥వె॥ చక్రి మొకటి మీఁద । సాగి పోవునె బండి,
రెండవ దెసఁ చక్రి । మొండు లేక?
కార్య సిద్ధి పురుష । కారమున నగునె
దైవ బలము లేక । దండి గాను?

కనుక "అన్యథా చింతితమ్ కార్యం దైవ మన్యత్ర చింత యేత్" అను నట్లయినది.

గున్న:— ఏమి వ్యాఘాయిత్యము! వేసిన పందిళ్ళ నూడఁ బెఱికించుటా! పిలిచిన బంధువులను రావ ద్దనుటా! ఇచ్చిన బజానాలను వదలు కొనుటా! పెండ్లి కొడుకునిగాఁ జేసి పెట్టిన కాటుక, పూసిన పసుపు పారాణులను తుడిచి వేయుటా! అదిగో! విఘ్నమ్మ వచ్చుచున్నది. గట్టి ముండ! ఈమెను బంపి వరి చేయించు కొనెదము.

శంకర:— ఈగ్రామమును బర దేవతాపీడ నుండి రక్షించు కొనుట కొఱకు మారెమ్మకుఁ గోళ్ళ గొంతుల నందించు రీతి శుభకార్యావిఘ్నము కొఱకు నీముండకు జామా రొకటి సం దించుట యాచారము. కాని 'శివా' యనుచు శుభముఁ దల పెట్టి 'షధవ ముండా,మల్లు జామాఁదూనా' యనికొస తరువాత నిడ వచ్చునని యూఱ కొంటిని. అక్కడేదో కాల్చియిక్కడకు

నన్ను పరామర్శించి జామారు లాగు కొనుటకు పరుఁగ
పరుఁగున వచ్చు చున్నది.

ప్రవేశము — విఘ్నమ్మ

విఘ్న:— శంకరప్పా! కొడుకు పెండ్లియట! చెప్పి నావేకావ
శంక:— తప్పు వచ్చినది. ఏమే! ఆమల్లు చా పందుకొనుము.
విఘ్న:— ఆనాఁడే యిచ్చిన నెంత బాగుం డెడిద?
శంక:— 'బుద్ధిః క ర్మానుసారిణీ!'
గున్న:— మా కొంప ముంచు కొంటిమి.

శంక:— ఆ। వె॥ ఎవరొ నీవొ కాని । యేగి రాగాత్రిమము:
చెప్పె లేదొ! జాబు | సేర నాకు:
మాదు పుణ్య ఫలము । నీదు దయ గలిఁగె
కుదురఁ గట్టు మత్త! । కొడుకు పెండ్లి॥

గున్న:— క॥ మా మానముఁ గాపాడుము;
మామూ లందించితిమి; న । మస్కారంబుల్;
మా ముద్దు కొడుకు పెండ్లికి
నే మాత్రము విఘ్న ముంచ । నీయకు, పిన్నీ!

విఘ్న:— మీ కేమి భయము? మీ పచులచు మానకుఁడు;
ఆ ముహూర్తమునకె సంసిద్ధులరు గండు;
శంక:— ఈ విఘ్నము నివారింపఁ బహును గదా!
విఘ్న:— బెదరి పోయినావు; తత్తర పడకు.

( విఘ్నమ్మ—నిష్క్రమణము. )

శంక:— ఓసీ! సంతలలో దళారీ లెట్లొ పెండ్లిండ్ల కీమె య
ట్లు. వసుదేవుఁడు గాడిద కాళ్లను బట్టు కొన లేదా! కటిపిం

చుటకు విశిపించుటకు నింతటి వారు లేరు.

గున్న:-- ఇట్లాగే బ్రతుకు చున్నది.

శంకర:-- 'మన ఏవ మనుష్యా ణాం కారణం బంధ మో క్షయోః' అను న శ్లోకపని జేయుట యం దొకరికి సంతోషమో యూపని జేయుటయె వానికి సంతోషము. లాభము నష్ట మను సంగతితో బని లేదు. తేలునకుగుట్టుట యందు సంతోషము. అందు వలన దానికిఁ గలిసి వచ్చు నదేమి యున్నది. అయినను కుట్టక మానునా? నైజము. [నిష్క్రమణము.]

---

అంకము 1. రంగము 5. పెద్ది భట్లు గారి యిల్లు.

ప్రవేశము: పెద్ది భట్లు గారు; భద్రుడు.

పెద్ది:- భద్రా! ఆ। వె॥ కుల ధనములు గల్గి। కునికి పాట్లు పడెదు
పెండ్లి కొడుకు మాట। వినను, వినను,
నంచు మదిని నలఁచి। యర్థ కులములను
జూచి వరుని, నకట! । చూడ నైతి.

"× × బుద్ధి జాడ్య జని తోన్మాదుల్ గదా! శ్రోత్రియుల్"
అను పెద్ద నార్యుని వాక్యము నా పట్ల నిజ మైనది.

భద్రు:-- శాస్త్రి గారిని నమ్మితిరి.

పెద్ది:- క॥ నాబాల్య మిత్రుఁ డౌటను
నా బోఁటి చదువరి యౌట। నమ్మితి వానిన్
ఏబాపను నమ్మఁ దగదొ
యీ బాపఁడు దైవ మనగఁ । గృష్ణుం డిలలోన్?

భద్రు:-- ఆలు మూఁ డైనను మూఁ డౌనైనను మూటఁ

ద్రిప్ప వచ్చునే! పెద్ది భట్లంతటి వారే తిరిగి పోయిరి! ఏమి! కాల వైపరీత్యము! అని లోకులు దవడలు నొక్కు కొను చున్నారు.

పెద్ది:—తథ్యము —"నీచో వదతి న కురుతే, న వదతి కురుతే సాధుః"

అనగా — క॥ నుడువును జేయడు నీచుడు,
నుడువడు జేయు నిల సజ్జనుడ; శాస్త్రులతో
నుడివితి స్థిర మనుచును, నే
నుడివియు మా టాడితిం గద! నోరే నాదిన్?

భద్రి:— స్త్రీ యొకతె బుద్ధియె ప్రళయాంతకము జేయునది యగు చుండ, అమ్మగారు, అయవ్వగారు మన యిరుగు పొరుగు స్త్రీ లింతమందిది కలిసి నప్పు డింత కాదూ?

పెద్ది:-- యద్వాగంతి తప్ప వేఱు కళంక మీావరుల కేమి గలదు?

— సీ॥ విద్యా ధనంబుల । వెలయు కులీనుండు
నల్లుం డయ్యె నటంచు । నాసం బడితి;
కట్న కానుక లింత । కొసరని యల్లుడు
దొరకె నాండంచు సం । తోష పడితి;
ఒకండై చక్కని । చుక్కయా పరుం డౌట,
నమ్మాయి భాగ్య మే । మందు నంటి,
తల్లి కాన్పులు దగ్గం । దండ్రి యార్జన హెచ్చె,
విలువైన వియ్యంబు । గలిసె నంటి,

ఆ।వె॥ "వట్టి మాట, వరుని । కట్టిది తే" దని
చెప్పు వారు నన్నుం । జేర రారె!

బ్రాహ్మణుండ! దాన । పాత్రుండ! యీ వర
వాక్య దాన మొసంగు । వారు లేర?

ప్రవేశము:— సోమి దమ్మ- విష్ణుమ్మ.

సోమి:— ఇదిగో! అయవ్వ గారు.

విష్ణు:— బాబు గారూ! నాప్రారబ్ధ మెంత బ్రిద్దలయినది!

పెద్ది:-- (నిట్టూర్పు విడుచుచు) వేంకటేశ్వరా! తండ్రీ! లేదనునా?

విష్ణు:- కం॥ జిహ్వాగ్రంబున లక్ష్మియు,
జిహ్వాగ్రం బందు మంచి । చెలు లాశ్రితులన్
జిహ్వాగ్రంబునఁ జెఱయును
జిహ్వాగ్రంబున మరణము । సెందుదురు నరుల్॥

పెద్ది:— ప ర్యవసానము దెలుపుదురూ!

విష్ణు:— బాబు గారూ! భారతములో

క॥ తనువున విఱిఁగిన యమ్ములు
ననువునఁ బుచ్చంగ వచ్చు । నతి నిష్ఠురతన్
మనమున నాటిన మాటలు
విను మెన్ని యుపాయములను । వెడలునె? యధిపా!

అని యున్నది. మఱియు

పెద్ది:— ఒక మాటలోఁ దేల్తురూ!

విష్ణు:— నేను పిల్లలు లేని బాల వితంతువను. కనుక యి రుఁగు పొరుఁగు పిల్లలను చుట్టుఁ జేర్చు కొందును. రవంత యుప్పిడి పిండిని చేతులలోఁ బెట్టుచుందును. బెల్లమునకుఁ జీమలు ముసురునట్లు నా గ్రామ బాలు రందఱు జేరుదురు. అందులో

మీా యల్లుఁడు ముఖ్యుఁడు. వీని పేరూ మాయింటి యాయ
యొకటే. కనుక యీా మాఋ పేరుతోఁ బిలుచు చుఁ
దాఁ నను. కాక వాని కేమిటి! యది యేమిటి!

పెద్ది:— అమ్మయ్యా!

విఘ్న:— శంక రప్ప కొడుకునకుఁ దథా స్వాతి యంటి
యను సరికి ముద్దు వేసింది. అతఁడు కమ్మని కుందనంపు మేః
గల దివ్య మంగళ విగ్రహుఁడు. సకల శాస్త్ర పారంగతుఁ
వినీతి పరుఁడు. శిష్టాచార సంపన్నుఁడు. కులీనుఁడు; చేతి
బంగారము వంటిది సంబంధము. నిశ్చయము.

పెద్ది:— ఓసీ! ' వీసంబును తొందర పడ।పిల్లలు దప్పన్
అంటిని. కాని నింటివి కాదు గదా!

విఘ్న:— తమరు పండితులే! ఆ శబ్దమున కదే యర్థమా
నీటి బుడగ కాదూ! చిన్నప్పుడు తవ తవ లాడు చుంటచే
పేరు గలిగిన దరుకో లేక పోయిరే! ఇంత పాపము నాకు దో
పోవు నదే యూనత్రిపు గుమాస్తా దయఁ గల వాఁడై న
తరువాతఁ దెలిసినది.

తే।గీ॥ విద్య పూజ్యము; పుట్టుక వికృతము; మతి
వృత్తి హీనము; నేమము।లేక లేక; మగ
టిమియు సున్న; వేషంబు బిం।క మివి హెచ్చు;
పరుల బాధింప విసిగింపఁ।బరముఁ బ్రియము!

ఈ విఘ్నము నిజముగా నావలనఁ గాఁదు. ఆ నక్షత్రో
వలననే! ఈ మహాత్ముని సాగింపుడు.

పెద్ది:— ఇప్పుడుఁ గదా నా మనస్సు కుదురు పడినది!

సోమి:— ఒక మాటు చూచి రారాదూ!

పెద్ది:- 'సంశ యాత్మా వినశ్యతి.' ఇంకానా? అవ్వ గారూ! వంక రేమియు లేదు గదా?

విష్ణు:-ఏ వంపు టొంపూ లేని బంగారపు బొమ్మ! మీపిల్ల యీ వేళయో రేపో యను చున్న ట్లున్నది. చేతులు గాలిన పిమ్మట నాకులు బట్టుట యగును. ప్రౌఢా వివాహములు శాస్త్ర నిషిద్ధములు. కూఁతు రవివాహితగ పుష్పవతి యైనచో తాలనో కుండలనో కట్టు కొని లోతైన నదిలో దల్లి దండ్రులు దిగుట మూలముననె పాప పరిహార మగు నందురు. అందులో బ్రాహ్మణ వైశ్యులకు తప్పని సరిగా!

పెద్ది:- నారీ ప్రథమ యౌవ నానుభవము కర్తవ్యము. కావున్న ' ఆలస్యా దమృతం విషమ్. ' కాన ప్రథమ రజస్వలా వయస్సునకుఁ బూర్వమె స్త్రీకి వివాహము విధి కృతము. ఆమె యౌవనములో నొకిం తైనను వృథ బోవుటకుఁ గారణ భూతు లైన వారికి భ్రూణహత్యా పాతక మంటును.

విష్ణు:- చిన్న నాటను నాటి నది నాటు కొను నంత బాగుగఁ బెద్దనాటను నాటు కొనదు. హృద్గతమై మఱపునకు రాదు. చిన్ననాటనె వివాహిత యైనచో కన్యకకు భర్తపై నాటు కొనిన ప్రేమకు చలన ముండదు. మహా పతివ్రత యగును. కాన ' అష్ట వర్షా ద్భవే త్కన్యా ' యనెడు వేద వాక్యమును ముమ్మాటికి శిరసా వహింప వలసినదే!

పెద్ది:- శారదా యాక్టు లేకుండిన ఇన్ని గ్లాగుదునా!

విఘ్న:- పాము కున్నన్ని యేళ్లు భర్తతో గడుప వ
యును;తగిన వరుని సంపాదించుటలో నాలస్య మగును. ఎట్లై
రజస్వల కాకుండ వివాహముం జేయ వలసినదే!

పెద్ది:- రజస్వల కాకుండ వివాహముం జేయక పోతి నే
యుండా యడిగి నావు నా పాట్లు!

పరాశర స్మృతిలో-.'ఋతు స్నాతాంతు యో భార్యాం స్వ
స్నవాధి గచ్ఛతి। బాల గోఘ్నపరాధేనయుజ్య తేనాత్రసంశయః'
అనియు,మను స్మృతిలో 'ఋతు కాలాభి గామీస్యా త్స్వ
దార నిరత స్సదా' అనియు నుండుట నెఱింగిన వాఁ డగు క
మున, దిలీప మహారాజు స్వర్గము నుండి వేగము యింటికి వచ్చు
టలో దారిలో కామ ధేనువునకు నమస్కరింప లేక పోయెన
రఘువంశము ప్రథమ సర్గలో 75 వ శ్లోకమున నిట్లున్నది:-

శ్లో॥ ధర్మ లోప భయా ద్రాజ్ఞీ మృతుస్నాతా మనుస్మరన్
ప్రదక్షిణ క్రియార్హాయాంత స్యాం త్వం సాధునా చరః॥

మీ రాలోచి తాగమమున నా పుత్రికా వివాహ విఘ్నమ
దీటినది. లేనిచో నా గత్యంతర మెట్లుండెడిదో!

పెద్ది:-ఓసీ!ఈముహూర్తమునకె తరలి రండనికబురుచేసెదను.

సోమి:- అవ్వగా రిన్ని విధములఁ జెప్పు చున్నది, కానిండు.

పెద్ది:- 'శ్రేయాంసి బహు విఘ్నాని' అనగా

కం॥ శ్రేయము బహు విఘ్న మయము
  శ్రే యారంభంబు లెంత । చీఁకా కిడునో
  శ్రేయము స్థిర పడు నంతగఁ,
  బాయక యత్నించు చుంట । ఫల సిద్ధి యగున్॥

అని యందురు. ఈవిఘ్నము కాన శుభ సూచకమే కాని మఱి యొండను కాదు. తరలి రండని కబురుఁ జేసెద.

(నిష్క్రమణము)

---

అంకము1. రంగము6.

రస పురము. ఒక పెండ్లి పందిరి

పరివేశము:- సంభావన బ్రాహ్మణులు. పెండ్లి సదస్యము.

పేరావ ధానులు:- వేంకటావ ధాన్లూ! దీపముల వేళ యగుచున్నది. ఇది యేమి సదస్యమోయీ! తేల్చరూ!భోజనమూ లేదు బొట్టూ లేదూ!

వేంకటా:- శ్లో. 'అతిథి' ర్బాలక శ్చైవ స్త్రీజనో నృపతి స్తథా
  ఏతే విత్తం న జానంతి జామాతా చైవ పంచమః॥

అను నార్యోక్తిని సత్యమనిపించితివి. నిప్పుఁ డతిథులము; యజమానుని కష్టముతో మనకుఁ బనిలేదు.

పేరా:- ఆయార్యోక్తికి నర్థమేమిటి?

వేంకటా:— క॥ బాలురతిథు లేలికలును
  స్త్రీలల్లుం డ్రోపికొంది । తెలిసికొనుటకై
  పాలుకొనరు గృహపతిసిరి;
  [illegible]

పేరా:— నీతో నీసదస్యమునకు రాఁబట్టి, స్త్రీవర్గులోఁ జే
వలసి వచ్చినది.

సుబ్బావ ధానులు:— సదస్య మనిన మొన్న నీ పురమున
జరిగినదె సదస్యము. పెద్ది భట్లు గారి యన్న దానము శంకర
శాస్త్రి గారి సంభావన యొక దాని కొకటి మించినవి. అయిదు
దినములలోనూ సలిపిన పిండి వంటలు ముఖ్యముగా నాక
బలి నాటి రాత్రి, పప్పు పులు సను కొన్నావా యేమిటి,
కాదు, బొట్టు ట్లింత వఱకుఁ దేన్పులు వచ్చుచున్నవి.

కాశ్మీరు పండిత శాలువ లెన్ని శాస్త్రి గారు కరిపించిరి
బ్రాహ్మణులకు స త్కార సమయమున! ఆయైదు దినములలో
నెప్పుడు వచ్చినా స త్కారమునకు సమయమేకదా శాస్త్రిగారికి!

సుబ్బా:— ఆ పెండ్లి కూఁతురు పాఠశాలల చదువులందును
పెండ్లి కొడుకు వేద శాస్త్రములయందు నారితేరిరి. చుంబిక
న్యాయము పట్టదు గదా!

సూరావధాన్లు:— 'పాఠ శాలల చదువులా! బాలికలకు?'
అనెడు సిద్ధాంతము లోని వారే పెద్ది భట్లు గారు!

పేరా:— ఇంగ్లీషుఁ జదివిన వరుఁ డెక్కడ పెదవి విఱుచునో
యని, భయపడి, యట్టి వాఁడె యల్లుఁడు గా వలయు నని
యభిలషించు చుండిన సోమిదమ్మ పెద్ది భట్లు గారి కనుమఱు
గున పాఠ శాలలకుఁ బంపు చుండినదవ! ఆయన యెప్పుడో
కాని యింటి యొద్దనే యుండఁడు. మన. ముం చామా!

సూరా:— బాలికలను బాఠ శాలలకుఁ బంపుట కత్తి

విషము...

సుబ్బా:— 'స్వభావో మూర్ధ్ని వర్ధతే' యను నట్లు పిల్ల స్వభావము మంచిదే యైనచో బాలశాల లేమి చేయును?

భోగన్నశాస్త్రి:— అట్లనకుము. 'సహవాస యా దోష గుణాభవంతి'

కం॥ స్నేహ మిడు దుర్గుణంబులు
స్నేహం బిడును గద పుణ్య! నీతుల నెపుడున్
స్నేహం బబ్బిదిఁ బడయుచు,
బాహాటముగ నదు లన్ని! ప్రాజ్ఞ ప్రోచే!

సూరా:— నానా పురుష వీక్షణ స్పర్శలను స్త్రీలెంత గల్గుదురో యంత త్వరిత గతిని లజ్జ నశించిన వారలగుదురు. 'పురుషాణా మభావేతు సర్వా నార్యః పతివ్రతాః' చూడండి! పాఠశాలలో నుపాధ్యాయునిగ లజ్జా స్త్రీయే ప్రవేశించినది యనుకోండి! వెంటనే తన లజ్జను వీడినదియై తాళమునకు సరిపడు నడుగుల నడకలు, వదులు చీర దాల్పులు, జాకెట్ల దొడుగులు, జేబురుమాళ్లు, ఎన్నో యినుప పెట్లున్నట్లు రొంటిని తాళపు చెవుల చింతకాయలు నున్నగు దాంభిక నిర్లజ్జాసూచన కృత్యములతో బజుల వీధుల టక్కు టక్కునుచు మిన్నంటుచుండును.

సుబ్బా:— లీలావతియింకనుముక్కుపచ్చలారనిపిల్లయేకాదా!

భోగన్నశాస్త్రి:— కనుకనే తలిదండ్రులు మరీ జాగ్రత్తగా నుండవలయును. చిన్న నాట నాటఁబడిన యభిప్రాయ బీజములు క్రమముగా మొలకలెత్తి పెద్ద వారలయిన కొలఁది

వేళ్లు పాతుకొని స్థిరపడును. మొలకనా చెట్టునా త్రుంపుట సులభము? మొలకై వంగనిది మ్రానై వంగునా?

సూరా:— అంతగా పాఠశాలల చదువు లవసర మైనచో బాలికలను బడులలోఁ జదువ వేయుట కంటె విగతార్తవలను పాఠశాలలకుఁ బంపిన బాగుండును. వీ రన్ని తీఁకిన వారు. ఇం టిలో వారి యవసరముండదు. పాఠశాలల కేగి విద్య నేర్చి కొని బాలికల కిండ్ల యొద్ద నొంటిగానె పాఠములు గఱపుదురు. బాలికా! చదువు వచ్చును. భూషణమై యఃల... రు వయ స్సున స్త్రీకి లజ్జా! సళింపదు.

సూరా:— విగతార్తవ లన నెవరు?

భోగన్న:— ముట్లుడిగిన వారు.

సూరా:— పాఠశాలలు సంసారములను మాలపల్లి చేయు చున్నవి.

వేరా:—మాలిన్య రహితుఁడు దేవుఁడు. దేవాంశులో!కొద్దియో గొప్పయో త్రికరణ మాలిన్య సహితులు. మాలిన్యులు మాలిన్య రహితు లగుటకు దేవునిలో నైక్య మగుట యసం గతము. వృత్త్యాహారముల ననుసరించి దేవాంశుల కుండెడు మాలిన్యములో హెచ్చు తగ్గు లుండును. కాని యొక దేహ తనకు వారసత్వముగ ననగా జన్మ వలన గలిగిన మాలిన్యము నకు నను వగును. కనుకనే ' అవశ్యం ప్రాయశ్చిత్త ' మందురు. అంతకు మించిన మాలిన్యమునకు లోనగుచోఁ దట్టు కొన లేక యొకఁడు దిన దినాయుః క్షీణుఁడగును ... తగ్గిన మాలిన్య

మునకు నలపడు కొలఁదిదీర్ఘాయు ష్మంతుఁడై పాపిశబ్దాను భవ నిశ్శేషుఁడై క్రమమున మాలిన్య రహితుఁడై ముక్త్యర్హుఁడగును. ఒకే డిగ్రీ మాలిన్యముఁ గల వారంద ఱొకే శాఖ. ఎక్కువ మాలిన్యము గల శాఖీయులు తక్కువ మాలిన్య శాఖీయుల యింటఁ భుజించినఁ బ్రిమాద ముండదు. తిరుఁగు మాటు ప్రమాదమగును. చూడు! రాజులు బ్రాహ్మణుల యింట భుజించెదరు. కాని రాజుల యింట బ్రాహ్మణులు భుజింప రు. ఇట్లే తక్కిన శాఖీయులను దహవేలు వేసి కొనుఁడు. ఆచారము ప్రతి శాఖీయుని యింటఁ దదనుగుణ్యముగాఁ బరిధవిల్లు చున్నది. గుణ క్రియలను బట్టి బ్రాహ్మ ణాది జాతులేర్పడినవి. బ్రాహ్మణులు సత్వ గుణ ప్రధానులయి యుండ వలయును. సత్య దాన శౌచములు సౌష్ఠవ మైన యుచ్చారణ గల మాటలు సదాచార వర్తనములు వారికి ముఖ్యములు. తదితరులకుఁ దదితర గుణాదులు ముఖ్యములు. నేటి బ్రాహ్మణులంద ఱట్లుండిరా యని వాదించుట కవకాశములేదు. రాజుల మను వారు రాజుల మనుట కెట్లర్హులో చెప్ప మనుఁడు. ఇట్లే వైశ్యులు, కాఁపులు మున్నగు శాఖీయులవారు తామెట్లర్హులో తెలుప మనుఁడు. బ్రాహ్మణుల మను వారు బ్రాహ్మణులేనా యను ప్రశ్నకు నప్పుడు ప్రత్యుత్తర మొసఁగెదను. సకల శాఖీయులకు గల్గిన పాడుకంటె బ్రాహ్మణులకు గల్గిన పాడు బహు తక్కువ. బ్రాహ్మణుల సెక్కసెక్కెముల నాడు వారు తోఁక తెగిన నక్కలవంటివారు. నేఁడు పాప కాలులు ముందు నెల్ల

జాతుల బాలికలను గలుపుచు నన్యజాతి స్త్రీ లుపాధ్యాయి
లుగ నుండి యేక రీతి బోధనలను జేయుచు నే జాతి బాలిక
జాతి మర్యాదలను నేర్పకుండుటచే, నాయా యాచారము
దూరులై తమ జాతి కనుకూల ప్రవర్తనలు గల వారు గా
బాలికలు దూషితలగుచున్నారు.

సూరా:— మఱి-...

వేరా:— ఉండండి, మాటకడ్డురాకండి, నేచెప్పుదానిని పూ
ర్తికానీయండి; ఇల్లు గృహిణి వలన సౌఖ్య వాచారము గ
యగును. బాలికలు గాఁబోయెడు గృహిణులు కనుక పలు
యుల బాలికలను నొకచోఁ జేర్చి సమిష్టి విద్యఁ గఱుపఁ
చిన నాఁడు, నిజాచారము మంటఁ గలియును. కలగా పు
మగు మిశ్ర మాచారము పట్టుబడి తుద కాబాలిక రెంటికి
రేవడియై దారీ తెన్నూ కానక తాను నశించును. గృహము
నశింపఁ జేయును. కాన పాఠశాలల యందు బాలికలను
వింప రాదు.

సుబ్బా:— 'వస్త్రేణ వపుషా వాచా' ఈసూక్తిననుసరించి
పురుషుల కందము హెచ్చును. 'కాంతా జనే ధృష్టతా'
అందము హెచ్చిల్లబెట్టుకొనినకొలఁది కాంతాజనుల హృద
ములను చెఱుపు వారగుదురు. శరీర మంతటిలోను ముఖమే
యాకర్షించును. ముఖములను రోతగాఁ జేయునవి యడవి
ములు; కాన మహమ్మదు తన శిష్యులచే గడ్డములను పెంచి
స్త్రీ హృదయ నైర్మల్యమును గాపాడెను. ఆర్యమత ప్రబోధ

నిదియె. తిథి వార నక్షత్రములు సరిగూడు వఱకు సీకర్మ నిషిద్ధ ము. ఆ సరికూడిన దినము స్త్రీలకు గర్భధారణకు మంచిదె యగు ను. భార్య గర్భవతి యైనది మొదలు ప్రసవమైన కొన్నాళ్ల వఱకు భర్త క్షురకర్మ నొల్లడు. గడ్డము మాసిన మగల నుండి సతులు విముఖులగుటచే వారును తత్ఫలముగఁ దటస్థిల్లెడు స్త్ర్యభావమున మగలు జితేంద్రియాభ్యాసకులయి యింద్రియ పటుత్వము మిగిలిన వారగుదురు. కనుక క్షౌరమునకు నాయుః కర్మయను పేరుగలిగినది. సంగీతపాటకులు స్త్రీల మనములఁ జెఱు పుదురు. కనుక వీరు సభాగారవ పఙ్క్త్యర్హతలను గోల్పోయిన వారైరి.

నిష్ఫల రతోత్సాహకులు క్షౌరకర్మను నిత్యకర్మగా నెంచి యనుదినమును మంగలి కత్తి నాఱుకొను చుందురు. క్షౌరము ముఖశుభ్రమునకుఁ గాదు; అందమునకె! శుభ్రము సోపులుకుం కుడుగాయలవలన మాత్రమె కలుగును. తుమ్మెదల నాకర్షించు టకు పలురంగుల పువ్వు లందము గలిగినట్లు స్త్రీహృదయాకర్షణ కొఱకు పురుషులు ముఖములను తళుకు బెళుకు గల్గునట్లు జేసికొందురు తత్ఫలముగ స్త్రీలచిత్తములదత్తరపడి విపులసంకరము వాటిలఁజేయుదురు. 'సంకరోనరకాయైవకులఘ్నానాంకులస్యచ' అని భగవద్గీత నుడివినట్టు మహాపాపు లగుదురు. ఈపాపము సంఘటిల్లు నని యర్జునుఁడు భయపడి యుద్ధమునుండి విరమించె ను. ఈనవనాగరికులసందముగా గనబడుట మాన్పించి యార్ష మతబోధనలకువిధేయులుగాచేయుడు. అప్పుడుస్త్రీలు వీధి కెక్క

న నుహోసి యుండదు.

వేంకటా:— వాయించ లేక మద్దిలిమోఁతైన దన్నట్లున్నది మీ
సెలవిచ్చినది. ఎవరి పిల్లను వారు జాగ్రత్త పెట్టుకొనుట సులు
యితరులను జాగ్రత్త పెట్టుమనుట సులువా? పాఠశాలలయం
చదివింపక పోవుటయే కాదు వీధి ముఖమునైనఁ జూడ నీయ
ఎవరి బాలికలను వారు జాగ్రత్త పెట్టుకొనవలసినదే!

సుబ్బా:— ఒకరి కన్న నొకరు! పులిమీఁద పుట్ట

భోగన్న:— వినండి! అరేబియా దేశమున నశ్వముల 'అశ
నాం మైథునం జ్వర, మను న్యాయమున బక్క గుఱ్ఱముల
బారలినను నెదురుగా జాతిగల మగగుఱ్ఱములను గట్టుకతన జా
గల గుఱ్ఱపు బిల్లలకె తల్లులగును.

మాతంగుని తల్లి ఋతుస్నాతయైన నాఁడొక కిరాతకుఁడా
కంటఁ బడెను. ఆమె యానాడె నిజపతివలన గర్భవతియయ్య
ను, తాను భయపడినట్లు కిరాతక బుద్ధిఁగల పుత్రుని బడసె

ఒక నాఁడాఁడు గుఱ్ఱమును సంధించిన రథ మెక్కి మాతం
మహా రాజు స్వయముగా ద్రోలు చుండెను. దాని పిల్ల (స
నంటి పోవుచు, నలసి, తల్లి నొక సారి యాగి పాలిమ్మన
తన్నొక కిరాతకుఁడు విరామము లేక తోలు చుంటఁ దాన
గఁగలననుటను నశ్వ భాష తెలిసిన యతఁడు గ్రహించి, నవ
దటాలున రథ మాపి, దిగి, యింటి కేగి, తల్లినడిగి, తనన
గిరాతాంశ సంక్రమించినదని తెలిసి కొనెనట! (భారత గాథ
ఎవరు కంటఁబడగా స్త్రీ పతి ప్రక్క దయమ్ము గర్భవతి యగు

యట్టి వాని ప్రతిమఁగను నది యగు నను సారాంశమును దెలి
సిన వారగుటచే నార్యులు గ్రామములఁ కట్టుబడిలో నొకశాఖ
వారి యిండ్లొకేచోట నుండునట్లు జేసిరి. పెఱ శాఖీయులపైన
దమస్త్రీల దృష్టిని బ్రసరింప నొల్లరైరి.

గాంధ్యనుచారిణులు గహ్వాలక్ష్మి, మాలపిల్ల, మున్నగు టాకీ
లలోపలె త్రాగుబోతులను ఛిన్నఁ జేయుటకు గల్లు పాకలలోని
కేగి త్రాగుడు నింద్యమని బోధించు చుంటిమని పొంగుచుందు
రే కాని యునయాస్తమయములూ వికృతాకారులగు త్రాగు
బోతులను జూచిచూచిన దృష్టితో గర్భవతులగుటచేతఁ దమ
కుఁ దాగుబోతు సంతానము పుట్టుచుండుననియుఁ దదీత్యా
త్రాఁగుబోతు లెక్కువగుటకుఁ గారణము తామగుచుంటి మని
యు గుర్తింప లేకుండిరి. వికారాంగులు, దుష్టులు, కూరులు,
అన్యమతాచారులు మున్నగు వారికి వ్రతులగు సుతాసుతులకు
దాము తల్లులగుచుంటిమని భయపడక రాత్రులాడెడు సినీమా
లకు నాటకములకు సైతముఁ బోవుచుందురు. బహిరంగముగాఁ
బలువుర ప్రేక్షకుల నాకర్షించు నటుల రాధాకృష్ణ భజనలను,
నిర్లజ్జా వేశ్యలకు చిహ్నములైన తాళాలు మద్దెళ్లతో, సేయుదు
రు. ఈపలువురను జూచిన దృష్టితో గర్భవతులగుదురు. దేశా
రిష్టులగు జుట్టుపోలిగాంధ్రను గాంధోళీలను గనెదరు.

సుబ్బా:— కని పెంచు యువతుల కట్టి ప్రమాదముండిన
నుండవచ్చును. బాలికలకేమి భయము?

భోగన్న:— బాలికలు పలువురను జూచినచోఁ దమ జననీ
జనకులు వెదకివెదకి చమటూడఁ దెచ్చిన సంబంధముల నీసడిం

చెదరు. జోసీ! బాలిక యిష్టపడు వరునకే కట్టఁ బెట్టెదమన్న
పాకీవాఁడు గవర్నరాహితాగ్ని, తోడల్లురగుట సిద్ధించును.
సోదరీలలో నొకతెయితనిని మఱియొకతెయతనిని వరింపవచ్చును.

సూరా:— స్త్రీలకు నిల్లకు లంకె యని యింకా సెలవిండు.

భోగన్న:— నిష్ఠ సాగ నియ్యనిది వీధి. అట్టి వీధికిఁ బురుషు
నకు లంకె. నిష్ఠ కనువగు నది గృహము. పురుషుఁడింటికి నేగు
నంతనె యతనిచే నిల్లాలు నిష్ఠ గమనింపఁ జేయును. బాలయో
గిని టాకీలో "నాన్న గారూ! బూట్సుతో వంట యింటి లోనికి
వస్తా రేమి" యని కలెక్టరు గారి చిన్ని కూఁతు రనుసరికి
ఆయన బూట్సు దీసి లోనికేగిరి. భార్యాభర్తలలో నొకరు
ప్రత్యేకము నిష్ఠ గల గృహము యొక్కయు మఱి యొకరునిష్ఠ
లేని వీధి యొక్కయు పనులను దిద్దుకొన వలసిన వారై యు
న్నారు. గృహమున కనువుగా స్త్రీ దేహములు వీధి కనువుగా
పురుష దేహములను సృష్టించిన బ్రహ్మకు నిదియె యుద్దేశమై
యుండ నోపు. బ్రహ్మ వాక్కులు విన గలిగిన ఋషీశ్వరులు
"నగృహం గృహమిత్యాహుర్గృహిణీ గృహముచ్యతే" యనిరి.

కం|| సతి లేమి కతి థ్యభ్యా
గతి స త్కారాదులుఁ జరు, గవు; సంతతికిన్
గతి సున్న యగును; గృహమే
సతి యగు: గృహ మది గృహంబె ? సతి లే కున్నన్||

అని దాని భావము. కనుక గృహమునకు గృహిణికి
లంకె. భార్యా భర్త లిరువురు వీధి కెక్కినచో, వీధి కనువు
గాని దేహము గల భార్యను పిచ్చి కుక్కల నుండి కాపాడుకో

నుటకే సరి పోవును గాని వీధి కృత్యములను జక్క పెట్టుటకు భర్తకు నవకాశ మెక్కడ? నిజ గృహ నిష్ఠ మంటఁ గలియును. నానా శాఖీయులతో గలిసి మెలసి చదువ వలసెడు పాఠశాలా విద్యార్థిని మఱీ మంటఁ గలుపును.

సుబ్బా:- ఇంటి కడఁ జదువుఁ జెప్పు వారుండరు. పాఠశాలలకుఁ బంపరాదందురు. చదువు వచ్చుట యెట్లు? చాకలి పద్దునైనా వ్రాయు వలయు ననెదరా లేదా?

భోగన్న:- చాకలి పద్దుల వ్రాతలు వచ్చి నప్పటి నుండియుఁ గొంపలు మునుఁగుచున్నవి. అంగవస్త్రములు, పట్టుకండువాలు, జల్దారివి, సాదావి- మున్నగు వానిఁ గలిపి పది కండువాలని వ్రాయుదురు. చాకలి విలువైన వాని దాఁచికొని యేచిరుఁగువానితోనో పది మూర్తులను లెక్క సరిపెట్టి యిచ్చినను స్వీకరించెదరు. మాయమ్మగారో సశాని. ఏబట్టను -నా బట్టను గుర్తించి చాఁకలికి వేయును.ఆరాగాఁ దీసి కొనును ఒక బట్టా పో నేరదు.

అత్త వారింటి కేగు వఱకు మాత్రమె బాలిక చదువును. 'అల్ప విద్యో మహా గర్వః ?' అందురు. పాఠశాలలో బాలిక స్వల్పకాలమునుండును. పతితోఁ జిర కాల ముండును. ఆ స్వల్ప కాలములోనూ గృహపతికి హిత వగు రీతి కృత్యములు తల్లికడ నేర్చికొని తరువాత భర్త కడ విద్య నేర్చుకొనుట యార్ష మత ప్రబోధమై యున్నది. 'భర్తాచ స్త్రీ కృతం పాప' మందురు .భార్య పాపి యగుట, భర్త సరియైన విద్యా శిక్షలను నేర్పక పోవుట వలని ఫలమని యందు ధ్వనించుచున్నది. కాన

వైదవ యేట బాలురకు వలె విద్యారంభోత్సవ ముహూర్త మును బాలికల కుంచుట యలవాటులో లేదు. రామాదులకు విద్యాభ్యాసమును వర్ణించిరే కాని సీతాదులకుఁ గాదు. పాఠశాలలో నిప్పటికిని బాలికల నుపాధ్యాయులు ప్రేమగుట తప్ప లేదు. భర్త యే విద్యయందు నిపుణుఁడగునో యావిద్యను తన సతిని పరిచయ పఱచును. తన కనుకూల వర్తినిగఁ జేసికొనును. ఎట్టి భర్త తమ కన్యకకు లభించునో జననీ జనకులకు ముందు తెలియుట యరుదు; కాన తమ కన్యకకు విద్యాభ్యాస మును క్రమించుటకు సర్హులుగారు. ఉపక్రమింపఁగోరిరేని విగతార్త వలను బడులకుఁ బంపుట మూలమున మాత్రమే చేయనగును.

సుబ్బా:— స్త్రీ లార్జించు వారైన భర్తల కెంత తోడ్పడు వారగుదురు? బడులార్జనరాంద్రగ చేయును గదా!

భోగిని:— 'అర్థస్య పురుషోదాసః' అనియున్నదేకాని 'స్త్రీ దాసీ' యనిలేదు పాఠశాలల విద్యార్థినులు ధనార్జనోద్దేశము గలవారై భారతదేశోచ్ఛ పవిత్రతలను మంట గలుపు చున్నారు. గృహిణి ధనార్జనాసక్తిఁ గొనినచో నింటనుదాస్యభోగములు నున్నయగును గణికలకు మాత్రము ధనార్జనము ధర్మము. సతులకుఁగాదు. ఏలనన—

భోగి:— కం|| పిత బాల్యమందు యౌవన

యౌశయము నంతనె మగండు | నుక్కసెడంగా

సుతులును బోషింపంగా

సతికి ధనార్జనమునందు| సక్తం బేలా?

కాన బడులు పురుషుల కవసరము. పురుషులను జూచి స్త్రీలు బడులు కేగుట పులినిజూచి నక్క వాతలు పెట్టుకొని నట్లుండును. ఆర్జన పరులు పురుషులగుటను తమకు జిన్ననాడు బడులలో నలవడిన పోకలు తమ యార్జనల ననుసరించి వర్ధిల్లును. స్త్రీలో! తమ భర్తలను బీడించి నిసిపించి తమ యభిలాషలను దీర్చుకొనుచుండ దాము సంపాదించిన ధనమును భర్తల చేతులలో పెట్టుదురా?

సుబ్బా:- 'శ్రద్ధధాన శ్శుభాం విద్యా మాదదీ తావరాదపి' అనుటం బట్టి

కం॥ చదువులు శ్రద్ధం గొనుచును శు
భద విద్యలు హీనజాతి । వారల కడయుం"

కనుక యుపాధ్యాయుని యేజాతి దైననేమి విద్య నేర్చుకొనుటకు?

భోగమ్మ:- స్త్రీలకు గురువులు భర్తలగుట సీధర్మము బాలురకు మాత్రమె. వీరును నన్యజాతీయుల యొద్ద విద్యనేర్చుకొనుచుండియు వారిని స్పృశింప రాదు. పంచములకు సమీపమునకు నైనను బోరాదు. పంచములు బౌద్ధులు ప్రేతమాంస భక్షకులు. రోగపీడితమై ప్రేతత్వ మావహిల్లిన మీందట తనంతట తాను జంతువు చచ్చును. బలవంతముగం జంపం బడిన యారోగ్యజంతువు నుండి తీసిన మాంసమునకు పండ్రెండు గంటలకుం బ్రేతత్వము పట్టును. ఈలాగు తినువారు ప్రేతమాంస

భక్షకలు కారు. ప్రేతమాంస భక్షకుల స్వేదమలమూత్రో
చ్ఛ్వాసములు ప్రేతవాయు పూరితములు. వారసత్వమున వారి
కాయాహారము అనువు కనుక శవదహన కార్యములో పంచ
ములు నిర్ణీతులైరి. తన శిష్యులు ప్రేతమాంసభక్షకు లగుదు
రేమో యని భయపడియే మహాత్ముడు జఘాను ప్రవేశ పెట్టె
ను. ప్రేతమాంసభక్షణ చేయు కాకి గ్రద్ద నక్క కుక్క మొద
లగు వానిని జఘా జేసినయెడ దినకూడదని నిషేధించెను. భార
తీయాగ్రవర్ణులలో శవవాహకులు మున్నది గడియలు మైలపట్టు
దురు. అటుపిమ్మట స్నాతులై ప్రాణాయామము పట్టి శుచు
లగుదురు. శవముకడ చాలకాలము నిలుచువాడు పుత్రుడు.
వాడెక్కువ ప్రేతవాయు ధూమము లాఘ్రాణించు వా
డగును. కాన వానికి సంవత్సరము వఱకు మైలి. సంవత్సరమధ్య
మందు వాడు దేవవ్రతము నాచరింపరాదు. పంచములు పేదలు
గాన తల్లినివలె బోషింప వలయును. అస్పృశ్యులు గాన రజ
స్వలయైన సోదరిని వలె ప్రేమించ వలయును. ప్రేతధూమవా
యువుల నాఘ్రాణించు వారల్పాయుష్మంతు లగుదురు.
'ఆయుః క్షీణం దినేదినే' యని యున్నది. అట్టి పంచములను బాలి
క తాకినయేని తాను రోగపీడితురాలై యత్తమామ మగల
కుపచరించుటకు మాఱుగా ఆసంసారమునకు ముసల మగును.
దుర్బల సంతానము గనును. ఆచార వ్యవహారముల నడుగం
టజేయును. పుట్టినబుద్ధి పుడకలతోగాని పోదనున్యాయమున

పంచములచే ప్రేతమాంసభక్షణము మాన్పింపలేరు. మాస్పం పరాదు.

సుబ్బా:— ఇప్పుడు మంత్రిసానులు, డాక్టర్లు, పంచములలో నెక్కు వగుచుండిరి. ఆహితాగ్నులే వారి నీళ్ళు త్రాగుదురు.

భోగన్న:— 'ఆతురే నియమో నాస్తి' యను న్యాయమున వారట్లు చేయుదురు. గాని యనారోగ్యమైన యగ్రివర్ణులే పంచమసమీప గమనము వలన నారోగ్యమునీడి రోగులయి యకాల మృత్యువు వాతను బడుచుండ బలహీనరోగి పంచమావృతుం డైనచోం రేపు మరణించువాండు నేడే మరణింప కుండునా? గర్భిణీ సుఖప్రసవ మెట్లగును? వారిడు మందుల ప్రయోజనములో కొంతబూడిదం బోసిన పన్నీరువలె కాకపూనదు. ప్రేతయొక్క ప్రారబ్ధానుభవ శేషము హంతకుం డనుభవించును గాన హత్యా పాపము. పంచమేతరుండు పంచమ సమీప మందినచో నాత్మహత్యా పాపమును, పంచముండు పంచమేతరు సమీపమందినచో పరహత్యాపాపమును బొందు వారగుదురు. నేలలో ననేకములు కుళ్ళి మగ్నమగును. నేల కాలినపుడు ప్రేతధూమ వాయువు లెగయును; కనుక బీటుక యాములు వేయువాండు ప్రేతవాయు ధూమములను తానుపీల్చు, నితరులచే పీల్పించును. కాన యాత్మపరహంతకుం డగును. పాపి యందురు.

సుబ్బా:— గాంధ్యనుచరులు పంచముల కిప్పు డరుంధతీయులను వేరిడి దేవాలయప్రవేశ మిడుచుండగ, మీ మాటలకుం

జెవిరియొగ్గు వారెవరు?

— భోగన్న:— భాగవతములో తృతీయ స్కంధములో కర్ద ముని సంతానమును గురించి చదివినవారు పంచముల నరుంధ తీయు లనరు. ఈ ప్రవేశ దానమువలనగలుగు ప్రయోజనము సున్న. దేవుఁ డొక్కఁడే యైనను భారతీయులు మసీదులలోను మహమ్మదీయులు హిందూ దేవాలయములలోను ప్రార్థించరు. ఎవరి కులదేవత ద్వారా వారే ప్రార్థించెదరు గాస!

పంచములలో మాదిగలు శైవులు; వీరి కులదేవత మాతంగి (పార్వతి). మాలలు వైష్ణవులు; వీరి కులదేవత కుంతి; విష్ణ్వంశ సంభూత. వీ రొకరి కొకరు నాతాంతకులు. వీరిసుద్ధరించుటకుఁ ద్రికరణ శుద్ధిగఁ గోరువారు మాతంగి కుంత్యాలయములను గట్టించెదరు.

మఱియు దేవాలయములలో నుండు శిలావిగ్రహములు దేవుళ్ళు గావు. భారతీయులకు తమ వేదము ముఖ్యము. అందఱు జదువలేరు. కానిదానిమహిమనందఁ గోరెదరు. వేదమశరీరి, శిలలు వాక్పవిత్రతను బీల్చుకొనఁ గల శక్తిఁగలవి. ప్రతిష్ఠ పూర్వకమున వేదమహిమను నొకశిలలో జొనపగా నది దానిఁ జిమ్ముచుండును. భాగతీయు లంతట తమ మాలిన్యముల ననుస రించి తగు దూరములో నిలబడి యాపవిత్రితను దమలో నావ హిల్లఁ జేసికొనెదరు కాని దానికి దమ మైలసోకనీయరు. ఆ నిలబడి నంతసేపు దేవునే ప్రార్థించెదరు కాని 'ఓశిలా! పేరాబ్జ

గారు ధర్మకర్తయైన శిలా! శిల్పకారబ్రహ్మంచేఁ జెక్కఁబడిన శిలా! యని సంబోధించరు. ఈవిగ్రహమునకు రవంత మైల సోకి నప్పుడెల్లను సంప్రోక్షణ జేసి పవిత్రతను నిలుపనిచో చాకలి తాయికి సమ మగును. అందులో ప్రేతవాయువుసోకినా యింకా యడిగినారూ! కనుక పంచములకు దేవాలయప్రవేశ మిడిన, దేవాలయములు పాడుపడుటకే కాని పంచములను బాగుపఱచు టకీమన్మాత్రము గాదు. పైగా దేవాలయములను పాడుపఱచె డు మహాపాతకులుగఁ జేయుటయు నగును.

ప్రేత వాయ్వాఘ్రాణముఁ గల్గుచుండు నిప్పటి యాంగ్లేయ పాఠశాలా విద్యార్థుల యారోగ్యాయుర్దాయము లెట్లున్నవో మనము నిత్యమూ కళ్లారా చూచుచుంటిమే కదా! ప్రేతవాయు స్పర్శవలన విగ్రహములో తెచ్చిపెట్టిన వర్చస్సు నిలుచునా? ఒక యాచారము కులకట్టుబాటుచే స్థాపితమగునేకాని ప్రబోధనల వలన కాదు. మహమ్మదీయులకు ప్రేతమాంసభక్షణ నిషేధము కులకట్టుబాటువలన గలిగిన వారగుటచే వారిని సందియింపక భారతీయాగ్రవర్ణులు వారికి సమీపగమనార్హత నొసంగిరి. పంచ ముఁ డయ్యును నందనారునకు సమీపగమనార్హత గల్గుట గాంధ్యనుచరుల సహాయమున కాదు; వాని యోగ్యసంచారము వలన. చాతుర్వర్ణ్యులంత యన్యోన్యము గలిగిన వారయ్యు నెన్నో యాచారములు వారివె కాని సహవాసమున మాఱనివి యయ్యె ను. అట్లే దేవాలయ ప్రవేశను పంచముల కిడి పాఠశాలలో

పంచమ మిశ్రమనుజేసి స్పృశ్యత గలుగ చేసిన పంచముల యాహారాచారములు మాఱుననుట మతి భ్రంశము. " అంగార శ్శతధౌతేన మలినత్వం నముంచతి " అనునది సత్యము.

కామావధాన్లు:- ప్రేతమాంస భక్షణమునుండి పంచములను విరమింపఁ జేసినచో!

భోగన్న:- ' రాజా రాష్ట్ర కృతం పాప ' మను న్యాయము న ' రాజ్యాంతే నరకం ధ్రువ ' మను విధివాక్యము వెలసినది, ' రాజ పాపం పురోహితః ' అను న్యాయమున నంతే పాప మావ హిల్లెడు క్షత్రియ్యాదులపౌరోహిత్యము నుండి విరమించెడు వారు బ్రాహ్మణులలో లేరు. ' మిత్ర ద్రోహేచ పాతక ' మని భగవ ద్గీతలో నున్నది. అయినను ' వ్యాపారం ద్రోహచింతన ' మను న్యాయసత్యమును గమనించి వాణిజ్యమును మానెడు వారు వైశ్యులలో లేరు. 'అథమా సేవయా వృత్తిః' అను న్యాయమున నధములు కాకుండెడు వారు ఆంగ్ల భాషా పట్టభద్రులలో లేరు. ' మధ్యమా కృషి వాణిజ్యాత్ ' అను న్యాయమున చాతుర్వర్ణజులలో మధ్యములు గాని వారు లేరు " నపశ్యే త్ప్రసవంతీంచ తేజస్కామో ద్విజోత్తమః " అను ప్రబోధమున ప్రసవమగు చుండ స్త్రీలను చూడనను ద్విజులలో డాక్టర్లు లేరు. 'పణ్యస్త్రీణాం ప్రత్యక్ష రక్షసా' మను న్యాయమున గణికలలో రాక్షసుల మనిపించు కొనని వారు లేరు. ' ధనమూల మిదం జగత్ ' అను సూత్రమున పాపభూయిష్ఠమైన వయ్యును

వృత్తుల ననుసరించి జను లుందురు. ప్రబోధన లెన్నియుఁ దమ వ్యాపారముల నుండి జనులను విముఖులుగాఁ జేయ లేవు. ఇఁక పంచములనా, ప్రబోధనలు మార్చునవి!

అనాది నుండియు నలపడిన తోళ్ల వ్యాపారము ప్రేత మాంసభక్షణము వీని నుండి వారేల విరమించ వలయును? అగ్రవర్ణుల కన్న స్వేచ్ఛా విహారమును సుఖవిరేచనము మున్నగు వానిఁ గోల్పోవుటకా? క్రైస్తవులైయున పంచములను జూడుఁడు! దేహములో నా! పోలెను నెత్తురు లేదు. దారిద్ర్యమా! హెచ్చైనది! సుఖమా! మలబద్ధకులైరి. వృత్తియా! బానిసలైరి. సంతతియా. దుర్బలులైరి. ఇన్ని యరిష్టములకు సమీప గమనార్హత యీడగునే? తాఁ చెడ్డ కోఁతి వనమెల్ల జెఱుపు నట్లు గాంధ్యనుచరులు వారలను గూడ చెఱుపఁ జూచుట బహు విచార కరాంశము. వీరలను భాగవతీయాగ్రవర్ణుల పాఠశాలలలో వారి మధ్య కూర్చుండబెట్టి వీరి నిన్ని కీడులకుఁ బాలు చేయుట యుచితము కాదు, కాదు.

సుబ్బా:— విశ్వామిత్రుఁడు వాల్మీకి మున్నగు వారు బ్రాహ్మణులు గావలయునని కొని యట్లు కాలేదే? పంచములు కారా?

భోగన్న:— విశ్వామిత్రుఁడు బ్రహ్మచరువు వలనఁ బుట్టెను. క్షేత్రదోషము పట్టెను. వాల్మీకి నాడీజంఘుఁడను బ్రాహ్మణునకుఁ బుట్టెను. కిరాత సాంగత్య దోషము పట్టెను. నైట్రిక్ ఆసిడ్‌లో వేసిన కలితి బంగారమునకు కలితి నశించి విశుద్ధత్వము

నిలుచునట్లు తపస్సు వలన బీజమున కావహిల్లిన దోషములు నశించి వారికి బీజస్వభావము నిల్చెను. ఏ బీజమున శుద్ధ విల్లునో యాబీజవర్ణములో తపస్సు వలన జ్యేష్ఠత్వ మందును. పంచముఁడు సదాచారము వలన పంచమ జ్యేష్ఠుఁ డగునే కాని యితర వర్ణస్థుఁడు కాఁజాలఁడు. తపస్సుచే బ్రాహ్మణులైన వారి చరిత్రలఁ బరిశోధించిన వారు బ్రాహ్మణ బీజోద్భవు లగు కతమునని యని తెలియఁగలదు. బీజమె ప్రధానము కాని క్షేత్రముకాదు: ఔకే గురువాకే తరగతి గల్గి ను కృష్ణుఁడు యాదవుఁడె కుచేలుఁడు బ్రాహ్మణుఁడె! ఉన్నట్లుండి ధర్మవ్యాధుఁడు కౌశికుఁ డంత మహాఋషికి ధర్మోపదేశము చేయునంత గొప్పవాఁడు కాలేదే! పంచముఁడుగ నుండియు నంద నారాధి కృతఁ గాంచలేదే!

పేరావ:.. పలు శాఖీయుల కుప్పిగంతులకు స్త్రీ స్వాతంత్ర్యము కారణము. బ్రహ్మకు బిదపనే సరస్వతి గలిఁగెను. వాలకిల్యులు, ద్రోణుఁడు, ద్రౌపది మున్నగు వారెందలో తల్లులు లేకయె పుట్టిన వారుండుటంజేసి స్త్రీ యొక్క యునికి సృష్టి వృద్ధికి నవిధాయక మని తోఁచకుండునా? కాని భారతీయుల సంసార రాజ్యములోఁ దీర్పుఁ జెప్పు రాజపదవి భర్తదె యుండ, సలహా నిడు మంత్రిపదవి భార్యదయ్యెను. ఈమె మంత్రాంగమునకుఁ బెడచెవిని భర్త పెట్టవచ్చును. ఇట్టి యస్వాధీన స్థానార్హురాలయిన స్త్రీకి ప్రధాన స్థానమిడఁ గోరి స్త్రీలోల భర్తలు బాలికా పాఠశాలలను ప్రోత్సహించెదరు. తమ

బాలికలను బంపుచుందురు,

వేంకటావధాన్లు:— దొడ్డిఁ బెట్టుచున్నారు, లెండోయీా!

సూరా:— ఉండవోయీా! వాఁడిచ్చేదీలేదు, చచ్చేదీలేదు. భోగన్నశాస్త్రిగారూ! బాలికా పాఠశాలలు వృద్ధియగుటతో రజస్వలా వివాహము లెంత నిర్భయముగా నగుచున్నవో!

భోగన్న:— రజస్వలా వివాహము లేమిటి? రజస్వలా=ముట్టు. ముట్టు దానికి పెండిలియా! ముట్టు దానికి వినఁబడు నట్లే పురోహి... ము మాత్రము లేకగుఁబెట్టును? ముట్టు దానిఁ దాఁకి యేవరుఁడు పుస్తెముఁడి వేయును? ముట్టుదానిని సమీపించి యేబ్రాహ్మణుఁడు పళ్ళెము లోని ఫల ప్రదానముఁ బెట్టును? ఆశీర్వదించి యక్షతలు వేయును?

సూరా:— పోసీ! రజస్వ లానంతర వివాహములనుకొనుఁడు.

భోగన్న:— రజస్వలా అనిన ముట్లంటెని. అనంతరము= కడపట, చివర, అనగా ముట్లుడిగిన పిమ్మట యని తేలుచున్నది. ముట్లుడిగిన ముత్తమ్మను వివాహమాడుటకు సిద్ధ పడెడు వరుఁడే యుండిన ‘ రతి పుత్రి ఫలాదారాః ’ —అనగా

దార కలిమికి ఫలము వి,స్తారంబుగ రతి సుతులను । జక్కఁగను దే!

యను వివాహోద్దేశము నెఱవేఱుటెట్లు? ఇంతకన్న రజస్వలా వివాహమె మెఱుఁగు. తరువాత స్నానముఁ జేసి గుడ్డలు తడుపు కొన వచ్చును.

వేంక:—సమయము దాఁటినదని సంభావన నెగఁగొట్టును. తరువాత చెప్పుకొనవచ్చును. లెండోయీా

అంకము 2. రంగము 1.

( పెద్దిభట్లు గారి యిల్లు )

ప్రవేశము. సోమిదమ్మ, లీలావతి.

సోమి:— లీలా! పరువు ప్రతిష్ఠలు కర్మాచరణాసక్తి వేద శాస్త్ర ప్రవీణత గలిగిన వరుడు దొరకుటచే మీ నాన్నగారు, స్థితిపరుడల్లుడగుటచే నేను, లెక్కలేనన్ని నగలు దిగవేయు టయు జక్కని వాడు భర్త యగుటయు నీవు, పెండ్లికి వచ్చు దప్పళములు తృప్తిగ లభించుటచే బంధు మిత్రు, లెల్లరు సంతసించెడు వారైరి నీ వివాహమునకు.

లీల:— మీరు నన్నుఁ జూచి సంతసిల్లు వారు. మీ కానందము గలుగుటయే నా కానందము. నాన్న గారేరీ!

సోమి:— అప్పుడు వెన్వెంటనే మనుగుడుపులు గాలేదు గదా! పాశములు చెడు నని కాబోలు పంపలేదు. సంవత్సరమైనది. పంపుదు రేమో యని యడుగుట కేగిరి.

ప్రవేశము—భద్రుడు.

భద్రుడు:— అల్లుడు గారు వచ్చిరి. తోటలో బాండములు దాగుచుండిరి.

సోమి:— నేను మడి గట్టుకొందును.

( సోమి:— నిష్క్రమణము )

లీలా:— అల్లుడే బాండము!

భద్రు:—

ఉ॥ చూచితి కోకిల—స్వరి ముఖ । శోభల నిర్వర పెండ్లి వేళలన్
చూచెడు భాగ్య మెట్లొదవు । సొంపుగ నింకొక సారి యొండొరున్?
వాంఛితిఁ జూడఁగా ననక । వాసిగ దాసు నెడన్ బ్రమోదమున్
మోచన సేయఁ జూచెదవు । మూర్ఖపు రీతి, నిదేమి యమ్మరో!

లీల:— కడుపులో నున్న మాట నంటిని. బూటక మాడ మనెదవా!

భద్రు:—

ఉ॥ తప్పనె నీవు నావరుఁడు? । తల్లియుఁ దండ్రియు ఖేద మొంద, నీ
కొప్పునె యిట్టులాడ? తల । లూపరె మాన ధనాఢ్యు లెల్లరున్?
తప్పులు భర్త యందరయఁ । దప్పవె యెల్ల గృహస్థ ధర్మముల్?
మెప్పును గాంచఁగా నగునె? । మేలులు దూరము గావె? సుందరీ!

లీల:— సరి పడని పతిని బట్టుకొని పీఁకు లాడు మనియా నీప్రబోధన!

భద్రు:— కం॥ నీ తీర్మానము మానుము
నీతి పథమునకుఁ దిరుఁగుము । నేతను నెపుడున్
రోతం జూడకు మమ్మరో!
పాతివ్రత్య మీద లేని । ఫలములు గలవే!

లీలా:— ఎంత నేపూ యదే పోగువేసి పలుకు చుంటివి.

భద్రు:— నాలో పక్షపాత మారూపింపక వినుము.

సీ॥ చదివితి నని కలా । చాల ధర్మంబులు
నడుగంట నీయకు । సుమ్మ నీవు;
" సర్వ వర్ణుల మధ్యఁ । జదివితి నే " నంచు
నాచారములు వీడ । కమ్మ నీవు;
సంసార కృత్యంబు । సహనంబు నొందుచు
'సతి' లేక చేయుఁ గ । దమ్మ నీవు,
స్వాతంత్ర్య మడుగుట । సతికిఁ దగ దటంచు
ముద ప్రాజ్ఞులను మీఱ । కమ్మ నీవు.

తే. గీ॥ పాఠ శాలల శేగిన । పడతియె సతి
యంచు బండితు లెల్లరు । హర్షమొందఁ,
దోడి సోదరీ మణులకుఁ । దోడ్పడుచును
మసలవలయు లీలావతీ । మాన్యురాల!

లీలా:— చిన్న నాటనుండియుఁ బండిత గోష్ఠిలో నీ వుండిన ఫలమున గదా! భారతీయ సనాత నాచారమును నా కిట్లు పరిబోధింపఁ గలిఁగితివి. 'సత్సం సర్గ స్స్వర్గః' 'సాధు సంగంబు సకలార్థ సాధనంబు' అను నవి నీ పట్ల సత్యమైనవి.

మా నాన్నగారి కను సనుఁగున మాయమ్మను బ్రోత్సహించి పలువుర మధ్యను నిజ గృహ బాహ్యం బందును ననగా పాఠశాలలఁ జదివించుటకు భుజములు గాయలు గాయు రీతిని నెత్తికొని నన్నుఁ గొంపోయిన వాఁడవూ నీవే! అట్టి చదువు నిప్పు డెత్తి పోషించిన వాడవూ నీవే! 'అతి' లేక సంచరింపు మంటివి!

భద్రు:— పడవి భాగార్థములు నీ శిష్టాన్వయ క్రమంబునఁ [illegible] శ[illegible]స సి కబ్బించినది నీదు పాఠశాలానుభవమే! మీ పాఠశాలలో సావిత్రీ నాటక మెప్పుడు?

లీలా:— శనివారము. నాకు సావిత్రి పాత్రిచ్చిరి. వల్లించు కొనవలయు. నాన్న గారికిఁ దెలియ నియ్యకు.

———

( నిష్క్రమణము. )

అంకము౨. రంగము౨. రసపురము. సావిత్రీ నాటకము.

ప్రవేశము:—(తెరలో) నటకులు పాంగు దారులు. (సభలో): పెద్దిభట్లు, దాసు, భద్రుఁడు, ఇతర సభ్యులు.

భద్రు:— (ప్రక్క సభ్యునితో) ఇంకనెంత సేపటికి నారంభించెదరు?

సభ్యు:— ఆరంభింపక పోవుట యేమిటి? మీ రాలస్యముగ వచ్చిరి. సత్య వంతుని చావు వఱకు వచ్చినది.

భద్రు:— ఇంత వఱకు నెవరు బాగుగ నాడిరి?

సభ్యు:— సావిత్రి మంచి రక్తి కట్టించు చున్నది. ఆమె సొగసుఒయ్యారము ఆట పాట డ్రెస్సు లావణ్యము మందహాస హంస గమనములు మృదుమధుర వాక్కు మొలకనగవు వాలు జూపులు, లజ్జాభినయనము!

భద్రు:— ఊ! ఊ!

సభ్యు:— ఇంద్ర నీలము వంటి ముంగురులు, పద్మమువంటి ముఖము, అర్ధచంద్రునిబోలు నుదురు, విల్లువంటి కనుబొమ్మలు భీత హరి ణేక్షణముల వంటి నేత్రములు, బాణముల వంటి చూపులు, తిల సంపంగి పుష్పములను ధిక్కరించు నాసిక, దొండ పండు వంటి యధరము, మట్టి పండును దిరస్కరించు గడ్డము మడమలు, శ్రీకారముం బోలు కర్ణ యుగము,

భద్రు:— ఎంత బాగుగ వర్ణించు చున్నారు. నే నాలస్య ముగ వచ్చుట మంచిదే యైనది. చూచినను నేనింత గ్రహింప లేను. ఇంకా!

సభ్యు:— చంద్ర శకలమును మించు చెక్కిళ్ళు, కోకిలా! వీణా! యను సందియముం బుట్టించు స్వరము, శంఖముం బోలు గళము,

భద్రు:— నిజముగా!

సభ్యు:- తామర తూండ్ల వంటి భుజములు, చిగుళ్ల వంటి కరములు, పగడపుఁ దీఁగెలను మించు వేళ్లు, మొగలి రేకుల వంటి నఖములు, సింహ మధ్యము వంటి నడుము, ఇసుకతిన్నెల వంటి పిఱుఁదులు, తాఁబేలు వఁటి మీఁగాళ్ళు, చిగుళ్ళఁ బోలు పాద తలములు, తీఁగె వంటి దేహము,

భద్రుఁడు:- నన్నెంత ధన్యునిగఁజేయు చున్నారు. మఱియు!

సభ్యు:- హంస నడక వంటి నడక, వేయేల! కలియుగ జగన్మోహిని! ఈమెకు నేభర్త సరిపడఁ గలఁడు? ఈమె ధోరణిని జూడగ టాకీలకుఁ జటా యించు నట్లున్నది.

భద్రు:- ఇంకను దెర నెత్త రేమి!

దాసు:- భద్రా! మీ సంభాషణ మెవరిని గురించి?

భద్రు:- ఏదో పిచ్చా పాటీ! లోకాభిరామాయణము!

సభ్యు:- ఆమె మీయభిమానస్థురాలు గాబోలు! మంచిని ఇంక! ఇంక! యనుచు వినిరి. ప్రతి పక్ష వర్ణన నే నుపపాదించుటను సహింప లేక విముఖు లైరి. సత్య వంతుని మరణదృశ్యమును సిద్ధ పఱచు చున్నారు. కనుక కొంచెమాలస్య మైనది.

టీచరు:- మా టాడకుఁడు! తెర లేచు చున్నది.

( తెర లేచును. )

సావిత్రి:- (స్టేజిలో) ముఖారి రాగము- త్రిశ్ర గతి.

ప॥ కట్టా దిక్కెవ్వరూ నా కీ—నడి కానను! (కట్టా)

అ॥ప॥ దేవ! దేవ!— నీవె దిక్కు—

వేగ రావె!— కాఠిన్యము వీడి (కట్టా)

చ॥1. సతతము భజియించెద సావిత్రీ దేవీ!

గతి నీ వని యనుచును నన్ను- గా పాడ కున్నా (కట్టా)

చ॥(2)కరుణ నీకు లేదా- కాపాడ్ మని వేడితి కాదా!

స్థిరత నీ వని బ్రోవ కున్న- ది క్కెవ్వరు న్న (కట్టా)

(సభలో)

పెద్ది:- భద్రా! ఆ సావిత్రీ వేషము వేసినది మన లీల కాదూ! ఎంత ప్రారబ్ధము మూడినది! ఎంత చేటు వాటిల్లినది! ఎంత పాపము బ్రిద్ద లైనది!

టీచరు:- ఏక గోడవే! అంతగా మాటాడఁ దలఁచిన వా రవతలకు దయచేయుఁడు!

(స్టేజీలో)

కల్యాణి రాగము. ఏక తాళము.

సావిత్రి:- " వెడలు చున్నాఁడే! నా విభుని ప్రాణములఁ గొని
నా కల్యాణపు బొట్టుఁ దుడిచి। కాఠిన్యముఁ బూని,
నా కాంతుని గొని యమ—నాథుఁ డతి నిర్దయుఁడై। వెడలు

(సభలో నుండి)

పెద్ది:- ( రోమాంకితుఁడై విజృంభణముగా బొబ్బ లిడుచు రంగపు గద్దెపై నుఱికి లీలావతి యొక్క విఱియఁ బోసిన శిరో జములను జేఁ బట్టి బడ బడ గ్రుద్దుచు)

పాఠశాల చదువు నాకొంప ముంచినది. జన్మ గొప్పదైనను సహవాసము ని న్నింతఁ జేసినది. దిక్కు మాలిన రండా! పలుపుర మధ్యను నిజ గృహ బాహ్య మందును బాలికలను జదువ నీయ రాదు; అనగా ' పాఠ శాలల చదువులా। బాలి కలకు? అను సిద్ధాం తామోదకుఁడ నగు నా హృతునిచే ' నాటక మాడించ మనిన వా రెవరు? భడవా! పెండ్లికాఁడా

మైన దానవే! మగని సాక్షా త్సముఖ మందు మగఁడిని చచ్చి నశ్లేడుచుటా!

అడవిలో నుండు ఋషి కన్యలతో నాడు కొనుటకు మచ్చ టిల్లిన మాత్రమున నచిరకాలములో సీతకు వనవాసము సిద్ధ మైన రీతి నీ పాడు పాఠశాలలలో నాకాశ రామన్న మగల చావు గోరై బాలికల నేడ్పించుట చేతనే యీ దేశములో నిండలు విధవలు వెలసిరి. వెలయు చున్నారు. సంఘ సంస్కార్త లకు నూపిరి సలుఁప కున్నది. గీతావాద్య నృత్యాదులు నిర్లజ్జ యగ్రాహ్యమైన వేశ్యలకుఁగాని లజ్జావ్రత సతులకుఁదగునే! ఏతత్బా లికా పాఠ శా లోపాధ్యాయులార! మీ జానెడు పొట్టలు నిండవా! ఇంత దే శారిష్టకమునకు నొడిఁ గట్టు కొను టేల? పంచ భూతము లహర్నిశలు విరామము లేకుండ కృషి సలిపి గదా! వల్లపు సముద్రపు టుప్పు నీటిని మంచి నీరుగా మార్చి యున్నత స్థానము నకుఁ గొంపోవగా, నా నీ రక్కడ నిల్వ నిచ్ఛగింపక న ద్యోదకమై, దిగువకుఁ బోయి, సముద్రములోఁ బడి, కలుష మగుటకు వేగిర పడు నట్లు భారతీయులు తమ ఋషుల మూలకమునఁ బొందిన యుచ్ఛను నశింపఁ జేసి కొను చుండ, వారిని వేఁగిర పెట్టుచున్న సైతాను లీ బాలికా పాఠ శాలోపాధ్యాయులె! ఈ పాపపుఁ బదవి నలంక రించుట కన్న జోలిఁ గట్టు కొని 'భవతీ భిక్షాం దేహి' యను నుపదేశము నకు న్యాయముఁ జేయ రాదా! ఛీ! భడవా! యీ వేషమును నీవేల ధరించితివి? నాతోఁ జెప్పకుండా!( "ఊ! ఊ" అని (గుద్దును.)

ఇదియును గాక మీ పాఠశాల కేపెద్దమనుష్యుఁడే తెంచి నను గ్రామములో నెక్కడఁ సభ కైవ్వ డగ్రాసనాధిపతిగనున్నను న్నాయనమ్మాయిని నలంకరించుకొని రమ్మని యామెచే మంగళ హారతి పాటలు స్వాగత పద్యములు చదివించి వాని మెడలోఁ బూల దండ వేయించెదరట. పెండ్లిండ్లలో నయ్యుతము పూజారి దెచ్చిన పూదండలను వధువుమెడలో వరునిచే మాత్రము వేయించునే కాని పురోహితుఁడు కూడ వేయనొల్లఁడే! వరుని మెడలో హారమిడు నామె యతని భార్యయగునని ఎన్ని స్వయంవర వివాహములు గనబడుచు చున్నవి. వివాహితలైన బాలికలచే నట్టి యభాగ్యపు పనులను నిత్య మెన్నియో చేయించి యాయా పెద్దమనుష్యుల ప్రాపొంది జీవింపఁ దలంచు నీచోపాధ్యాయుల కడనా నీవు విద్యనభ్యసించునది! నడు, నడు. (అని గుద్దును.) పరుల మెడలలో పూదండలు వేసినట్టినాటకము లాడునట్టి బాలికలు పిదప కలహకంఠు లన్యగృహ ప్రవేశినులు పరానుకూలు రగాలిసినులు పరిహాసభాషిణులు స్వయమర్థచోరిణులు మున్నగు వారై భర్త కుపచరింపని వా గగుదురు. ఛీ! భడవ! నడు! నడు. (అని గ్రుద్దును.)

సభ్యుఁడు:— ఆ హార్మోనిష్టు తెలగుడ్డలను పీకి సావిత్రి మీఁది కళ్లు విసరు చున్నాఁ డెందులకు?

ఇం కొకఁడు:— భుజంగ ఏవ జానీతే భుజంగ చరణం సఖే' యను నట్లు ...

ములకుఁ దెలియును. పురుషులయ్యు-నీబాలికా పాఠ శాలోపా
ధ్యాయులు స్త్రీసమ్ములు. కాకున్న వారి తత్వరహస్యము దెలిసి
చదువుఁ జెప్ప గలరా? ఎందులకు విసరు చుండెనో నాకెట్లు తెలి
యుఁ గలదు?

మఱి యొకరు:— ఈడువచ్చిన బాలికలను నిజగృహ బాహ్య
మునకుఁ బో నిచ్చిన నిట్టి యవమానములు గలుగక మానవు.
ఇట్టివి నోటీసు పూర్వకముగా జరుఁగవు. కాన ఎనిమిదవ
యేడు వచ్చు సరికే మహమ్మదీయులు యాఁడు పిల్లలను తమ
సోదరుల నైనఁ జూడ నియ్యరు పాఠ శాలలకుఁ బంపుట భార
తీయులు మానినగాని యిట్టి యప్రతిష్ఠను లోనగు వలసినవారే!

ఇం కొకఁడు:— రామారావూ! నీ వేక తొందర పడు
చున్నావు. ఇంటికిఁ బోయి గుర్రిద్దు!

మఱి యొకఁడు:- స్కూలులోఁ జదువు కొనిన పిల్లనే కాని
పెండ్లి యాడనని యింగ్లీషుఁజదువుబాలు రనుటచేఁ బాఠశాలలో
బాలిక లెక్కు వగు చున్నారు కాని భారతీయుల యుచ్చవ
ములుసల మీ బాలికా పాఠ శాలలే యని దృఢముగా గుర్తించి
తత్పాఠ శాలా భవనములకు బునాదులతోఁ బెళ్లగించి వైచి
పలుశాఖీయుల మధ్య గాని నిజ గృహ బాహ్య మందు కాని
తమ కూఁతుండ్రకుఁ జదువు గఱపించుట మాని, జననీ జనకులు
తమ కుల గౌరవములను గాపాడు కొందురు గాక!

టీచరు:— సభ్యులార! దయ నేయుఁడు. పాఠ బోధన నాట
కములు స్త్రీ నాటకములని నాటకములు ద్వివిధములు. మొదటి

రకము విద్యార్థులకు బాధములు హృద్గతములుగాఁ జేయుటకు సాధనములు. కనుక యర్హములేయన వచ్చును. రెండవవి నటకులను జెలుపున ప్రేక్షకులకు సంతోష మిడును. మొదటి రకముతో నాగరక యిప్పటి తలి దండ్రులు సంతసించు నెకిలితత్వముఁగల వారిగా నెంచి, స్టేజి నాటకములను బ్రవేశ పెట్టుటలో మేము చేసిన యపరాధమును శ్రీ పెద్దిభట్లు గారు దిద్దినందులకు వారికి కృతజ్ఞుఁడను. తమ కూఁతులను సీమకుక్కలవలె సాకెడు తలిదండ్రులు లాంగ్లవిద్య సభ్యసించెడు నవనాగరికు లల్లుండ్రు గారేమోయనియో, యుగుచుఁ జత్తురేమోయనియో, లేక యేలకపోదు రేమోయనియో, యప్రయోజకు లగుదురే మోయనియో, మున్నగు చిల్లిగంపెడు సంకోచములను లోలోనఁ గల్గి, యుపాధ్యాయినులో, మంత్రసానులో, రోగిసేనులో (నర్సులు) నై జీవింపఁ గలరను నాశయములతోఁ దమ బాలికలను బడులకుఁ బంపుచుండగా, మఱల వోట్లు రావేమో యను కొని బోర్డు పరి పాలకులు బాలికా పాఠ శాలలను స్థాపించి కాతారు కాలు జాయితో బిల్డింగులు గట్టించగాఁ, బొట్ట కూటికై మా బోం ట్లుపాధ్యాయులము సిద్ధ మగుచుంటిమి. బడుల యందు విశ్వాసము లేని వాఁడను. నాకూఁతుళ్ల నొకప్పుడూ బడులకుఁ బంపను. నా మనస్సాక్షికి వ్యతిరేకముగా సంచరించు చున్నందులకు యముఁడు నాకుఁ గ్రొత్త నరకమును సృష్టింపక మానఁడు. ఇదిగో! నా పా ఠుద్యోగము నుండి విరమించు చున్నాను. పెద్దిభట్లు గారు జ్ఞాపకఁము

జేసిన భవతి భిక్షాం దేహి యను నుపదేశమునకు న్యాయముఁ జేసెద! వందే మాతరం! (నిష్క్రమణము)

---

అంకము 3. రంగము 3. దాసుగారి యిల్లు.

ప్రవేశము: లీలావతి–భద్రుఁడు.

భద్రు:– (మామగారి మరణమునకు లీలను బరామర్శింపుటకు వచ్చి) మనుగుడుపునకు వెళ్లి తిరిఁగి రాకుంటను దాసుగారచటనే యతికిపోయిరను విచారము చేతను మీ పునస్సంధాన కార్య సందర్భములో నీ వలన గలిఁగిన దుడుకు చేతను కడుపు పగిలి యారంభించిన విరేచనము లెక్కువై వాతము గ్రమ్మి మామ గారు స్వర్గస్థులయి యుండనోపు!

లీలా:– చచ్చి మామ గారు, బ్రతికి యత్త గారు కలువైరి.

భద్రు:– అదేమిటి?

లీలా:– అట్లా రుద్ర భూమికిఁ మామగారు గొంపోఁబడిరి. ఇట్లా భర్త వ్రాసిన విల్లుఁ జేఁబట్టి యత్తగారు చెల్లలిల్లుజేరెను.

భద్రు:.. "కోడలు వన్నెల విసెన; పాఠశాలలో నాటి దీరినది. ఉపచరించుటకువెనుక సోపు బిస్కట్లకు ముందు సిద్ధము నీవు షుక్కపిల్ల, కాకున్న అర్ష మతస్థులకు లీలావతీ నామమేమిటి? సుగుణాభి ధామఁ డయ్యె. మాయబ్బాయి యామె వలలోఁ దగులకుండ మాకఁ దక్కవలయుగదా! గొంతుకలో నీళ్లు పోయునది యగునా? పోయునదిపో! పోయుట కర్హమైన యాచార వ్యవహారములు గలది యగునా?" అని నీ వివాహము

తథాస్త్వితి యైనప్పటి నుండియు మీా యత్తగారు పల్కుచుం డెడిది. ఆయభిప్రాయము సత్య మనిపించితివి గాఁబోలు!

లీలా:— జగన్మోహిని వెంట శివుఁడు మేనక వెంట విశ్వామిత్రుఁడు రాజశేఖరి వెంట నా ఋషీశ్వరుఁడు దగులు కొనినట్లు నా వెంట నాయన దగిలి యుండిరి. భర్తకు నానందముఁ గలుగఁ జేయుటయుఁ దప్పే?

భద్రి:— అత్త మామలకుఁ గూడ యానందముఁ గలుగఁ జేసినచో! ఇంతకూ మూలము స్వయం ప్రజ్ఞా దురంధర వైన నీకుఁ జిన్నప్పటినుండియుఁ బాఠశాలానుభవ మొంటఁబట్టుటయె. నిన్నొకప్పుడైనా పాఠశాలకుఁ బంపక, యార్ష మతాచారములో శిక్షితు రాలుగఁ జేసితిమో, యందును నుత్తీర్ణవై సీత, దమయంతి మున్నగు వారి వలెనె పుణ్యశ్లోకురాలవై యుందువు. నీ కొంటరి కాఁపురపు టిచ్ఛఁ గలిగించినదియుఁ బాఠశాలా విద్యయె!

స్వానుష్ఠాన సమయమున మునీశ్వరులు సహిత మసండితులైనట్లు నిన్నుఁ జూచి దాసుగారు స్వయంవ్యక్తి లేనివారైరి. ఆమె యెవరు?

లీల:— నే నిడకుఁ వచ్చినది మొదలు మా యిరువురకుఁ గలిసినది.

భద్రు:— ' ఊహలు గలిసిన గాని స్నేహము గలియదు ఒకే జాతి పక్షులొక్క యెడఁ జేరు సనరులు ' మనకున్నది

ముఖమునఁ గనఁ బడును. ఆమెయందు శూర్పణఖ యొక్క ముఖవర్చస్సు గోచర మగు చున్నది.

లీల:— భద్రా! నీవు విశ్వాస పాత్రుఁడవు. నాన్న గారు నిన్ను నాకు వరుణముగా నిచ్చెద ననుచుండెడు వారు. ఇక్కడనే యోగుము. నా కిహ సౌఖ్యము నేకూరును. స్త్రీ చిత్తంబు నమ దాంపత్యము కొఱకుఁ దత్తరిల్లు చుండుఁ గాదే!

భద్రుః— తాము వరించిన స్త్రీలను వివాహ మాడుదురు కొందఱు. వీరికి విడాకుల చట్టమవసరము. చెప్పులబేరకాండ్ర తంతు. ఆర్ష మత మన్ననో! జననీ జనకులు దెచ్చిన సంబంధముల నొప్పుకొని వివాహ మాడి త దనుగుణ్యముగా నాజన్మాంతము సంచరించుట వధూ వరుల ముఖ్య కర్తవ్య మని బోధించును. సతు లతుల చపల మతులు. గృహ బాహ్యమున కేగ వీలు కాని వారు.

లీలా:— నేను వీధిని బడ కుండఁ డోడ్పడు మనిమె నిన్నుఁ గోరునది.

భద్రుః— మానము స ర్వార్థ సాధకము. మాన ప్రాధాన్య మెఱింగిన కృష్ణ దేవ రాయలుఁ నీ వెవర వని యడుగుటకు మాట వృథ పుచ్చుటకు నొల్లక చేతిలోఁ బుస్తకము లేక బ్రాహ్మణులు, సుత్తి లేక కంసాలులు, కట్ట లేక కాఁపులు తక్కెడ దండియో గజము బద్దయో సోలయో తవ్వయో లేక కోమట్లు మున్నగు వారు వీధులఁ గనఁబడ రా దని యాజ్ఞ

పించెను. రసికు రాండ్రు సెంట్లతో నిండిన జేబు రుమాళ్లు, తముల పాకులకు సీనెలు దీయుచు నడి వీధి నడకలు, పూలు ముడి దిగువను గాలి కెగురు కొసలు గల జారు జడలు, వార జూపులు, మున్నగు చిహ్నాలు గల్గి యుందురు. తలవాకిట ద్వార వేశ్యల కడ నిలబడి, యిటు నటుఁ జూచు చుందురు. వీరలు చక్షుర్జివ్వాలు

లీలా:- అట్లు వర్తించుటకు సావకాశము లేని దానను.

భద్రు.— క॥ ఒక్కతె పుత్రిక వగుటను
జక్కఁగఁ గఱపించెఁ దల్లి । చదువులు నీకున్,
మిక్కుటపు తీవి నుంటిని,
లెక్క యగునె పిలక దాల్ప । లీలా! నీకున్?

తే॥ గీ॥ రాజుఁ జూచిన కండ్లకు । రమణుఁ డగునె
యగ్ని సాక్షిగఁ బరిణయ । మైన మగఁడు?
వేష భాషలతోఁ గూడు । విటులఁ గనఁగ
నైది కాచార దాసుపై । ప్రమద మున్నె?

లీల:— నిజము గ్రహించితివి. గత్యంతరము?

భద్రు:— ఆ॥ వె॥ భోగ్య వస్తు వౌట । భోగంబు కొఱకునై
పాప మతుల నెపుడు । దాఁపు నుంట,
వనిత వీధులందు । గనఁబడఁ గూడదు;
ఇంటి కృత్య మొకటె । యింతికి విధి॥

నే నొక మాటింటి కేగి వచ్చెదను. (భద్రుఁడు నిష్క్రమణము)

పరివేశము—చెలికత్తె.

చెలికత్తె:— ఇంత తడుక నీతో మాటాఁడిన వారెవరు?

లీలా:- మా నమ్మక సేవకుఁడు. తిరిఁగి వచ్చెను. ఇక్కడే యుండును.

చెలికత్తె:- లీలా! పుట్టిన యిఁట నీ పీవలిచెంబు నావలఁ బెట్టక యొకనా డైనను నిప్పు రాజిలఁ గేయక యెంత సుకుమారముగఁ బెరిఁగిన దాన నఁటివో యంతగా నొంటరి కాఁపురం బొంది కష్ట పడు చుంటివి.

లీలా:- పాఠ శాలలో నాటకములను బ్రదర్శించు నెడ, నా కియ్యఁ బడిన పాత్రి పాఠ భాగములను నభి నముతో వల్లె వేసికొని నప్పుడుఁ, బ్రదర్శన సమయమునఁ జూపరుల మెప్పుఁ బొందుటకునై యోర చూపులు తాళవు టడుగులు ఒకరితో మాటాడుచు మఱి యొకరికేసి చూచుటలు మొదలగు నభినయ విశేషములను నొంటిమెయి నభ్యసించెడు దానను. పాఠ శాలలో స్త్రీ పురుష విద్యార్థుల కడ బుజున్రఁ జూచు కొను దానను.

బైటకుఁ బోవు నప్పుడెల్లను నెఱ్ఱ పూలు ముడి, వదులుజడ, పెడపాపిడి, సిల్కు బూట్సు, రంగు రఁగుల గుడ్డ గొడుగు, దేహ స్ఫుటమును దాఁచీదాఁచని పలుచనిజాకెట్లు, స్టాకింగుస్, మోకాటి పావడలు మున్నగు వానిని దాల్చి బైటకుఁ బోవు దానను. న న్నెందరో యెగ దిగ చూచు చుండెడి వారు. వీధులలోను పాఠ శాలఁలోను యువకుల తోను టీచర్లతోను చిఱు నవ్వునవ్వుచు నేనాఁడు చుండెడి ప్రస్తావ వాక్యములను నన్ను బాలిక లనుకరించెడు వారు.

చెలి కత్తె:— ఈ లీలలను నీవనుదినము పాఠశాలలకుం బోవుచుండిన కాలములోఁ బఠించితి వభ్యసించితివి, పోషించితివి. 'లీలావతీ' నామము నన్వర్థాభి దాయకముఁ జేసితివి. కాన నీయందు సాటి లేని యంద చందము లింపు సొంపులు వన్నెచిన్నెలు స్వభావ యోగ్య క్రియలు ప్రస్తావ సదృశ రసోక్తులు మొదలగు నవి బాగుగ పలక మూఱినవి. నీవు మఱవ వలయు ననినను మఱపునకు నివి రానేరవు. లౌకిక పరిస్థితుల యందు నీవిముడ నేరవు. ఇంత శక్తి నీ కిచ్చినది నీపాఠశాలా విద్య యొకటె. అరణి కుమారిని యైనను మర్దనచే తేజోవంత మగు నగ్నిని గనునట్లు, నీ జననీ జనకులు వైదిక శిష్టాచార ఛాందసులయ్యును పాఠశాలా విద్యాభ్యాస సహాయమున నీకు నిట్టి యొయ్యారముఁ గలుగఁ జేసిరి.

లీలా:— యస్య నాస్తి స్వయం ప్రజ్ఞా శాస్త్రం తస్య కరోతికిమ్'

కం॥ స్వయమగా ప్రజ్ఞా శూన్యుల
రయ! శాస్త్రము లెన్ని యున్న । రసనాగ్రమునన్,
నయముఁగనఁ గలరె? పండిత
మయ సకల భయంబు గదిరి । మాటాడును రే?

పాఠశాలలకుఁ బోవెడు బాలిక లందఱు నావంటి వారు కాక పోవుటకు స్వయం ప్రజ్ఞా విహీను లగుటయె కారణము. దున్న పోతు మీఁద వర్షము, అడవినిగాచిన వెన్నెల, చెనిటివాని ముందర శంఖధ్వని, వారు నేర్చెడు పాఠశాలా విద్య. "ఆచారాల్లభతే హ్యాయుః" అను మూర్ఖోక్తిని గమనించెడు సతులు ముమ్మాటికి స్వయం ప్రజ్ఞా విహీనులు.

చెలికత్తె:— కామ శాస్త్రి గారి మాట యేమిటి? ఉపేక్షిం
చి నట్లున్నది.

ఆ॥వె॥ కామ శాస్త్రి, చూడ! । కందర్ప మూర్తియె
సర్వ విధము, లహహా । సౌఖ్య మిడును;
ఎంద జైనఁ గాని । యీడుగా నేరరు
కామ లీల లందు । ఘనుఁడు సువ్వె!

లీలా:— అదే యాలోచించు చుంటిని. లోక సంగ్రహము
తెలుపక యాత్మ గౌరవముఁ బోపీడక, యభిలాష దీర్చుకొను
ట నా చూపు.

చెలికత్తె:— ఎన్నోనాటక ప్రదర్శనము లందు నాటి తీరితివి.
ఈసమస్యను విప్ప గల యుపాయ మెఱుఁగవా?

లీలా:— ఒక సంస్కృత నాటకము లో నాయంటి యామె తన
విటునికి నొకగూఢ వార్తను నొక బరణి ద్వారా పంపినట్లుఁజది
విటి. నేనట్లుఁ జేసి రేపు రాత్రికె వానిని రప్పించెద. చూడునాశక్తి!

(నిష్క్రమణము.)

అంకము III- రంగము 2, కామ శాస్త్రి గారి భవంతి.
ప్రవేశము:— కామ శాస్త్రి గారు.

కామ:— కడు వివిక్త మైనచోట బడంతి గోష్ఠి చిత్తచలన
ముఁ జేయును. ఇట్టిపరిస్థితిలోనె బ్రహ్మ తన కూఁతుఁ బట్టి
యుండ వలయు. కాము శక్తి కోర్వఁ గల వారున్నె! శాస్త్రము
లేటికి కామ భాగకున్?

కాని నాఁడు శివ్రుఁ డశరీగము మిగులు నట్లు చేయఁగ
నేఁడనిను మిగుల నట్లు దీక్షిత ప్రణీతం బైన 'మన్మథ పరామర్శ

శతకము' మన్మథుని గర్వ మణంచెను. ఈ శతకము మన్మథు
నిపై దాడి వెడల కుండ భర్తలను నిరుత్సాహ పఱుచు నది.
కాని చేట పెయ్యవలె మాత్రము పయోగింపు మనును.

మరుఁడా! నీవు పాపివో! నీ యుత్పత్తి ఫలము నెఱుఁగ లేని
నిర్జితేంద్రియులు పాపులో! జితేంద్రియత్వ మిహ పర సుఖ
దాయకమై యుండ నజితేంద్రియుల సంఖ్య పెరుఁగుటకు నీవె
కారకుఁడవు. నీ యెడ కార్పణ్య దోషోపహత
స్వభావులగుఁ గష్ట జీవులతో నీవు డీకొను కతమున నీవును
గష్టుఁడవు గా కుందువె! ఎట్టి వాఁడ వైనఁ గమ్ము! సృష్టికి
సహాయ భూతుఁడ వైన నగుదువు గాక! నీకు వసతి నిడిన స్త్రీ
జాతియు నీకు నోర్థ మంగళులైన పురుష జాతియు నుభయులు
నేఁ బవలు తహతహ లాడు మనంబులు గల వారై నిద్రాహా
రాపేక్షకులై దైవధ్యాన, వైదిక యజ్ఞ యాగాది కర్మాచరణ
నిరవకాశులై వృద్ధ జననీ జనక పోషణాది సత్క్రియాదరణ
స్వభావులై, భవిష్య త్సంతతి పోషణార్థమై లుబ్ధ పూర్వీకులు
కాముఁ దినక యొకరికిఁ బెట్టక యార్జించిన యాస్తి ధ్వంసకులై
విస్సు కాలోచితంబుగ వాడ నందున నిస్సంతులై జూనవు
లెంత పికి పికి లాడు చుండిరి!

ప్రపంచకమునకు నింత యల్లరి......

(ప్రవేశము—లీలావతి యొక్క దాసీ)

కామః— మా యింటఁ బని సేయుట మాని యెన్నాళ్ళకుఁ
గదఁ బడితివి?

దాసీ:— శంభు దాసు గారి భార్య లీలావతీ గా రీబరణిని మీకు స్వయముగ నందిమ్మని పంపినది. (అందు కొనును)

కామ:— (పరిశీలించి) రాఁబోవునది ముందు సూచించును. ఈ బరణి శృంగార కేళీ విహారాహ్వానమును దెలుపు చున్నది. లీలావతీ నామ మన్వర్థము. ఇందు వికసించియు వికసించని సహస్ర పత్రి కమలము గలదు. మూఁత పైన సర్పము, శివుఁడు, హనుమంతుఁడు, సంపెంగ పుష్పము వీని చిత్తరువులు గలవు. ఇంత గూఢ సందేశము నేసామాన్య స్త్రీ పంపఁ గలదు?

(1) పద్మపు మొగ్గతో సరోజ సౌష్ఠవముఁ బోల్చుట కవి సాంప్రదాయము. కనుక యది యిందు గలదు. (2) వాయు స్పర్శ వలన మొగ్గలు విడుచును. సర్పము వాయు భక్షణముఁ జేయును. కనుక కుచ మను మొగ్గవిడువ లేదని సర్ప విగ్రహము జూపు చున్నది. (3) మన్మథుఁడు యౌవన నాశకుఁడు. శివుఁడు మన్మథ దహకుఁడు. కనుక కుచ పద్మ యౌవనము మన్మథునిచే నపహరింపఁ బడ లేదని శివుని చిత్తరువు జూపు చున్నది. (4) పద్మ మిత్రుఁడు సూర్యుఁడు. రవి దర్శనమున పద్మము వికసించును. హనుమంతుఁ డొకప్పుడు రవి బింబమును మ్రింగఁ బోయెను. కాన హనుమంతుని జూచి రవి భయపడును. కనుక రవి స్పర్శ దగుల నీకుండ హనుమ ద్విగ్రహము గాపాడు చున్నది. (5) పద్మ మకరందమును దొంగిలించునవి తుమ్మెదలు. తుమ్మెదలకు సంపెంగ వాసన గిట్టదు. కనుక లోనున్న మొగ్గ యొక్క మకరందము ననుభవించిన వారు లేదని సంపెంగ జూపు చున్నది.



----- -- ---

సారాంశ మేమన 'నెవరి చేత ననుభవింపఁ బడని ప్రథమ యౌవన వంతు రాల నగు నవ కోమల గాత్రిను. మీ యాగమనమునకు పరీక్షించు చున్న దాస' నని తేలు చున్నది. స్త్ర్యభిలాష నీడేర్చని పురుషుఁడు పురుషుఁడే!

కాని చీటికి ప్రాలు ప్రాణము. దాసీ దాని మాట విని ప్రాలు లేని చీటిఁ బట్టి ఆ గృహిణి కడ కేగ నామె యిట్లొనిన మంచిదె! ఈకొన కన్నను, ఈ కొనియు రహస్య భేద మగు నపుడును, న న్నాధార పఱచుకొని తన పతీత్వము వెల్లడించు నేమో! ఇట్లు మోసపోయి యెడలుపట్టి నన్ని దెబ్బలు దిని పరిహాసాస్పదులైన వారి చరిత్రములెన్నో యున్నవి. ఏది యెట్లయినను మనసు నిలుచుట లేదు. పోయి జాగరూకతతో మనలెదను. ఓసీ! సగే యనుము. (నిష్క్రమణము)

అంకము ౩. రంగము ౩.

దాసు గృహము, తెల్లవారు జాము-

పరివేశము. లీల, దాసు.

( లీల మంచము పై పరుండును. దాసు దుప్పటిని గప్పుకొని యొడిలోఁ గూర్చుండును. మామూలు రీతిఁ దనయొడిలోఁ దన చెలికత్తె గూర్చున్న దను కొనును లీల. )

లీలా;- క౦॥ చెలి? రాత్రి గదే! రతి సుఖ
మలవడి తృప్తాస్త నైతి! । నంగన యగుచున్
ఇలలోఁ బుట్టుటకు ఫలము,
కలయుట కళలను [illegible] । ఘన [illegible]లోన్.

* కం॥ మండల పతి-సతి పతియా
పండిత శంకరుని గూడి । పడసిన సుఖముల్
మెండుగఁ గోరితి రాత్రిని
పండిత వరు కామశాస్త్రి । వలతను నేసున్॥

తే। గీ॥ కళల స్థానంబు లెఱుఁగు మ । గండె మగఁడు
ఇట్టి వాని పొందు గలుఁగ । నింపు గలుగు;
సులువు లెఱుఁగని గాడిద । బలిసి యుండి
యశ్వ రీతిని స్వారికి । నమరఁ గల డె?

తే। గీ॥ కళల స్థానంబు లెఱిగిన । ఘనుఁడు కతన,
శాస్త్రి తొల్తొలు తనె చెప్పె । శాంతి నాకు;
'ఊఁక' పెట్టవు వినుచును । నూఱకుందు;
నీదు మన సెక్కడకుఁ బోయి ! నిలిచెనో చెలి!

( అని వీఁపుమీఁద గ్రుద్దును. దాసగుట గుర్తించును. అంతట )

కం॥ చూచితిరా కల తీరువ?
చూచితిరా నిద్ర రీతి! । చోద్యము సుండీ!
సూచించితిఁ గల నంతయు!
చూచితిరి స్వయముగ లేక । సుస్థిర తమలోన్?

దాసు:— ఇది కలమో సత్యమో నమ్ముటా, నమ్మక పోవుటా? ఇట్టి సందియము లిది వఱ కెన్నో గలిఁగెను. అప్పు డప్పుడు

---

* ( శంకరులు రాజ కళేబరమునఁ బరకాయ ప్రవేశ మొంది పతిమె కళాస్థానములు నేర్చిన సందర్భము. )

ఆ॥ వె॥ గాథ నిద్రి తెచి । కాంతా! యనుచుఁ బిల్వఁ
బలుక కుందు వీవు; । పట్టి చూత
మంచుఁ బలు కులు మది । వను కొనియు, నిదుర
తోడ సాగుచుందుఁ । గూడ రాక॥

అయినను శ్లో॥ "ఔదంబ రాణి పుష్పాణి శ్వేత వర్ణంచ వాయసమ్ మత్స్య పాదం జలే పశ్యే న్ననారీ హృదయ స్థితిమ్"

అనగా ఆ॥ వె॥ మేడి చెట్టు పువ్వుఁ । జూడ శక్యంబౌను
తెలుపు వన్నె కాకిఁ, । దెలియ నగును
నీటఁ జేప గాళ్లు । నిర్ణయింపఁ దరమౌఁ
గాని వనిత మనసుఁ । గాన దరమె?

అని యుండుటం జేసి పట్టు కొన యత్నించుటయు నృథా ప్రయాసయే! ఇదియును గాక నీవు చపల చిత్తు రాల వని జను లను కొనుట కర్ణా కర్ణిగ విను చుంటిమి.

ఒక నాఁడు వెన్నెల రాత్రిని మన పెరటిలోని మామిడి చెట్టెక్కి నన్నుఁ బండ్లు కోసి వేయ మంటివి. అట్లు జేయుచు

తే॥ గీ॥ కొత్త మానవుఁ జూచితిఁ । గొమ్మ క్రింద,
"వా రెవరు? శబ్ద మేమిటి? । పల్కి!" యంటి;
"నెవరు రాఁగల రిక్కడి । కిపుడు! ఫలముఁ
జప్పరించు చుంటి; నదియె । శబ్ద" మనవె!

అంతటితో నూఱ కుంటివా? నన్ను దిగు మని నీవు చెట్టెక్కి యీ ప్రశ్నవె వేసి చెట్టెక్కు వాని కిట్లుఁ దోచుఁ నవి లోపించితివి.

లీలా:— మీ మానస వీధిని నన్ను గురించి యిన్ని తబ్బి బ్బులు పడి న న్ననుమానముగాఁ జూచుచుండ, మగఁడు

గొట్టిన మధూకరపు వాఁడు కూడ గొట్టు నను నట్లు లోకులు నన్ను లోకువఁ గట్ట కుందురే? నేను మీ కొంత వశవర్తినినై మెలఁగిన నేమి నా గ్రహపా టట్లున్నది. మీ దయకుఁ నేఁ బాల్పడిన దాసిని.

దాసు:— అబ్బే! ఇది సందియములు గాని నిర్ధారణలు గావు. సందేహమును ముద్దాయి పక్షమున వీడ వలయు. సందేహ పడి నేరమును మోపు చేయ రాదని శిక్షా స్మృతి చాటు చున్నది. మన మొుంటరిగా నాడుకొను చుండిన యీమాటా యామాటల లోని మాటలివి.

చూడు! మా నాన్న గారి యస్థికలను వారాణసికిఁ గొంపోయి గంగలోఁ గలుప వలసి యున్నది. ఇపుడే ప్రయాణము. నేను తిరిఁగి వచ్చు వఱకు జాగ్రత్తగా నుండుము. భద్రుఁడు నీకుఁ దోడగును. (దాసు నిష్క్రమణము)

లీలా:—భద్రా! ఇటు త్వరగా రమ్ము.

(భద్రుఁడు ప్రవేశము)

దాసు గారు నా మీఁద కోపపడి, తండ్రి యస్థికల మిష మీఁద కాశి కేగు చున్నారు. వెన్వెంటనె వెళ్ళి, వారిని మఱల్చి కొని రమ్ము. (నిష్క్రమణము)

దృశ్యము: ఊరు బయట.

ప్రవేశము:—దాసు, భద్రుఁడు.

భద్రు:—దాసు గారూ! ఎక్కడికి?

దాసు:—ఒగర్చు కొనుచు వచ్చి నావూ! మా నాన్న గారి యస్థికలను గాశికిఁ గొంపోవు చున్నాను.

భద్రు:—అంత యకస్మాత్తుగ పయన మైరి!

దాసు:—మీా యమ్మ గారికి బాధ్యత యొంటం బట్టలేదు. నా యునికి విలువను హ్మాద్గత పఱుపం గోరి రేపో మాపో జరుగ వలసిన పరిహూణమును పెట్టు నేడే కొంటిని. నే వచ్చు వఱకు సహాసాహిత్యుండ వై యామెను గని పెట్టుము.

భద్రు:—తమకుం దెలియని ధర్మములు లేవు. పత్నిపైంగోప మున తను రేగు చుండి రని లోకు లనుకొనెదరు. అమ్మ గారిని లోకుఁ గట్టెదరు. ఒక మనవి:—

కం॥ సిరి సంపద సుఖ తతికై
పర మాధారము పగనికి । భార్యయె సుండీ!
నిరసనం బత్నిని వీడెనుం
బురుషుని జెందంగం గలవె । పురు పార్థంబుల్?

దాసు:—ఇదియు నాలోచనీయమె!

భద్రు:—మఱియు—

మ॥ సతి పత్నీత్వముం దిన్నం జేయుటనగా । శక్యంబె యే భర్తకున్?
సుత దాంపత్యము లోకమందుం గలదే! । సుగ్గాడగా నర్థమే?
సతి భావంబులు లెక్కంజేయని పతుల్ । సన్యాసులే చెప్పుండీ!
మతి వైకల్యము లోక నింద గలుఁగన్ । మాన్యంబె యోచింపుండీ!

దాసు:—చిన్నప్పటి నుండియుం బండిత గోష్ఠిలో నుంటిని. సత్సంగమును శాస్త్ర వ్యాసంగము దేశ సంచార మీామూటిలో నేది లభ్య మైనను నొకండు పండితుం డగు నందురు.

భద్రు:—మఱియు:—

ఆ॥వె॥ తార చంద్రు శయ్యెఁ । జాల్చ నిచ్చెఁ గనదె?
పతియు గౌరవింప । సతియు నయ్యె;
అబలలు గద! పత్ను । లంచు నందఱు దల్వ
నరయ లేరె లీల । యబలె యనుచు!॥

దాసు:—ఎంత బాగుగ నా మనసును ద్రిప్పి వేయఁ గలిగితివి!

భద్రు:—హను మంతుని నెదుట కుప్పి గంతు లను నట్లు మీా యెదుట నా సుద్దులు. క్షమింతురు గాక! తమ రింటికి దయ సేయుఁడు. మఱి యొకప్పుడు సతీ సమేతముగా బయలు దేరుదురు. గాని! నేనింట నుండి వచ్చి చాల కాల మయ్యెను. పోయి వచ్చెదను. (భద్రుఁడు- నిష్క్రమణము.)

(ప్రవేశము : ఒక ముసలి కుండ నాల శాస్త్రి గారు)

శాస్త్రి:—అయ్యా! ఈ మహా భ్యాహ్నికము తమ యింట నీ లగునా?

దాసు:—చిత్తము. దయ సేయుఁడు.

దృశ్యము:— దాసు గృహము.

ప్రవేశము:— దాసు, శాస్త్రి, లీలా.

దాసు:— శాస్త్రి గారూ! ఈయరుఁగు మీాఁద దయ సేయుఁడు (లోపలి కేగి లీలతో) ఓసీ! ఒక వృద్ధ శాస్త్రి, మహా పండితుఁడు, విప్రోత్తముఁడు, పూర్వ పుణ్య వశమున మన కతిథిగ లభించిరి. వారిఁ దోడ్తెచ్చితి.

లీలా:— భద్రుఁడు గనఁ బడెనా?

దాసు:— వాని రాక నీవెఱుగుఁదు వన్న మాట! అతడు

రాకున్నను ఈ శాస్త్రి గారు తారసిల్లక పోయినను నీపాటి కెక్కడుండునో!

లీలా:— అర్థమైనది. కానీ!

ఆ॥వె॥ గారిమ మిఱత యుండఁ । గానంగ నైతి మే!
తడుము కొనుచు వచ్చి । దాఁప రించె;
చదువు వాని యందె । సంక్రమించు;మనము
పొంగ నేల యంత । రంగమందు?

దాసు:— గట్టిగ నలవకుము. ఆయన వినిన లేచి పోవును. నవ నాగరిక తాచారము దారీ తెన్ను లేని తప్పుల - బొంత మైనను నీకు రుచి.

తే॥ గీ॥ అతిథి వాఁకిట నుండగ । నతని వీడి
తినిన యన్నము గోమాంస । మనిరి బుధులు;
అల్ల యాపోశనం బగుఁ । గల్లు సమము;
అతిథి నింద యర్హ మగునె । యతివ! నీకు?

నేను నా శాస్త్రి గారి వంటి వాఁడనె! ఎందఱేఁడు నాతిథ్య మనుదినము నే నపేక్షించెదను! వీనిని బొమ్మంటిమా కిందు నుమియు వా రుండరు. నా మానముఁ గాపాడుము. (వీధిలోని కేగి) చెలువుఁ జూపెద రండు. అనుష్ఠానముఁ దీర్చి కొనుఁడు. మీ మూట కట్టు లోపల నుంచెదను.

(శాస్త్రి గారు, దాసు— నిష్క్రమణము)

(లీల రుబ్బు ఱోటికిఁ బసుపు రాచి కుంకుమ బొట్లు పెట్టు చుండును.)

(ప్రవేశము: ఉతికిన మడుగు ధోవతుల పడచలు తలపై నడ్డ సడ్డముగ నుంచుకొని శాస్త్రి గారు.)

శాస్త్రి:— (దొడ్డి లోనికి నేగి) అమ్మా! ఈ దండెముల మీఁద బట్టల నాఱవేసి కొందునా? (ఆఱవేయుచు) అదేమిటి? ఆరుబ్బుఱోటిని బాత్రిమును బసువు కుంకుమములతో నలంకరించుచున్నావు! బిక్కు బిక్కు మని చూచెగ వేమి యమ్మా!

లీలా:— (గద్గదముగ) చెప్పితినా మావారికి, చెప్పకుంటినా మీకు నపకారముఁ జేయుదాన నౌదును.

శాస్త్రి:— ఎవరికిఁ దెలుపను. నీ మాటను బైటఁ బెట్టను. చెప్పుము. తల్లీ!

లీలా:— ఆ॥ శా॥ శాస్త్రి గారు! వినుడు। శాస్త్రిలు జదివిన
గొప్ప వారు మీరు!। చెప్పుచుంటి;

శాస్త్రి:— తల్లీ! అమ్మా! చెప్పు!

లీలా:— దేవికి బలి నిడును। నా విభుం డిప్పుడు,
మిమ్ము నిందు రుబ్బి। మెదల కుండ॥

కాన మిమ్ముఁ బట్టుటకుఁ గట్టుటకుఁ బాలేంద్రుడు పగ్గముల కొఱకై పొలమున కేగిరి. ఈపాటికి వీధి దారిని వచ్చుచుందురు.

శాస్త్రి:— ఆ॥ శా॥ అమ్మ! తల్లి! తెలివు। మమ్మ! దొడ్డి తలుపు;
దాసు కంటఁ బడక। దాటి పోదు;
బ్రతికిన యెడఁ దిందుఁ। బలుసాకు నైనను;
ఎండ కొండ లనక। నెగిటి పోదు॥

(దొడ్డి దారిని శాస్త్రి— నిష్క్రమణము.)
ప్రవేశము—దాసు.

[ లీల రుబ్బు ఱోటిని కడిగి వేయును. ]

దాసు:— శాస్త్రి గారు స్నానముఁ జేసి రాలేదూ?

లీల:— దొడ్డ శాస్త్రి గారు లెండి! ఎట్లా దొరికిరో కాని! నేను పచ్చడి రుబ్బుచుంటఁ గుండ నాలాడించు కొనుచు వచ్చి తాను రుబ్బుటకై పాత్రి మిమ్మనిరి. మీరసలే యను మాన పడుచుండిరి. కనుక నసేమి యంటిని. మీయింట నమృతమస్తంటే బ్రాహ్మణుఁడను గా ననుచు నీదొడ్డి దారిని జెప్పవ నేగిరి. ధోవతులను కూడ నిక్కడనే పీడిరి. ఎంత బ్రతిమాలితి ననుకొన్నారు!

దాసు:— మన బోంట్లన్న మిడుట యొకరికి నాఁకలి దీర్చుటకుఁ గాదు మన గృహశాంతి కొఱకె! ఆఁకలిఁ దీర్చు వారు సత్రములు వేయుదురు. గృహ శాంతి యిట్టి వారికిఁ బెట్టుట మూలమున మాత్రమె యగును. కాని కుంటి గ్రుడ్డులకు సంత ర్పణలు చేయుట వలన కాదు తక్కువ ఖర్చుతో నెక్కువ పరువు బొందఁ గోరెడు దాంభికులట్లు చేయుదురు. దూర్వాసుఁడతిథిగా నేగి యన్నదాత నెన్ని బాధలు పెట్టెడు వాఁడు! అతిథి సత్కారానకుఁ డగు మంగలి కొఱకుఁ గాదె శ్రీకృష్ణ భగ వానులు దుర్యోధనునికి నొడలు పట్టెను! కబీరున కన్ని యాప దలు మంచు వలె వీడి పోయెను!

"అభ్యాగత స్స్వయం విష్ణుః" అందురు. ఆయన కాపాత్రము నిడిన నిల్వక పోవునా? నే దానిం గొంపోయి వాని కిచ్చి శాంతింపఁ జేసి త్రో వ్రెచ్చెదను.

లీలా:—అతిథి వాఁకిట నుండగానతని వీడి......అనితమరు

సెల విచ్చిరి. ఇప్పుడు వాఁకిట నెవరును లేరే! మీారు భోజ
నముఁ జేయ రాదూ!

దాసు:- మంచి సారాంశమును దీసితివి!

(దాసు పాత్రిముతో నేగి దారిలో శాస్త్రిఁ గలిసి కొనును.)

దాసు:- ఆ॥పె॥ అగు పండి తుండ! ।యందుకో పాత్రము!

శాస్త్రి:- పనికి రాను దాస! ।బలికి నేను;

దాసు:- కోప పడకు మయ్యా! ।గుండాగ్రియిఁ దెచ్చితి!

శాస్త్రి:- దాస! రాకు! రాకు! । తగ్గి పొమ్ము!

దాసు:- పాత్రి మిదిగో చూడు! । పోకుము! ర మ్మిటు!

శాస్త్రి:- భోజనంబు వద్దు! । బొట్టు వద్దు!

దాసు:- గుండు కొఱకు నింత । గోలఁ జేసెద రేల?

శాస్త్రి:- పిల్లలు గల వాఁడ! । విడువు మయ్యా!

(కొంత దూరము పరుగిడి దమ్ముఁ బట్టలేక చతికిలఁ బడి దాసు సమీాపించుటఁ గాంచి.)

(తనలో)నాఁడు పరిక్షితునకు మరణ సమయము దెలిసినది నేఁడునాకు! 'యాంతే మతి స్సాగతిః' అందురు. కాన హరిభజన చేసి విముక్తుఁడ నయ్యెదను (గట్టిగా) హరే రామ హరే రామ రామ రామ హరే హరే!

(దాసు సమీాపించును.)

దాసు:- శాంతింపుఁడు! మిమ్ముఁ బోషించు వాఁడనే కాని హింసించువాఁడనుగాను. మీాభయకారణమునువిశదపఱుపుఁడు!

శాస్త్రి:- నేఁడు పెట్టని దినము. నాదారిని నన్నుఁ బోనిండు! మీా రాపాత్రిముఁ దే గతం బేమి?

దాసు:— తమరు దుబ్బెదననగా నొప్పుకొన నందునయామె పైనలిగి,పోవు చున్నట్లు తెలిసి యాపాత్రమును మీ కందించి యలుక దీర్చి భోజనమునకుఁ గొంపోవ వచ్చితిని.

శాస్త్రి:— మీ భార్య యిందిరి మహేంద్రి జాల! మీదే వికి నన్ను బలి నిడుటకు మీరు సంసిద్ధులై నట్లు నమ్మించినది. భయపడి పాటి పోయి వచ్చితి.

దాసు:— నిజముగా నామెను నమ్మితిరి. కానున్న ధోవతు లను వీడెదరా! ఆమెను గురించి యింత ప్రత్యక్ష ప్రమాణ మెప్పుడు దొరకలేదు. తక్కిన ప్రమాణములపై నాధారపడి కాశీకిఁబ్రయాణ మైన నే నిప్పు డేల యాగ నలయును?

(నిష్క్రమణము—)

అంకము 3 రంగము 4 (విప్ర యోగము)

దాసు గృహము—

ప్రవేశము—లీలావతి, భద్రుఁడు—

లీలా:— మీ యయ్య గారు పర దేశ గతులై సంవత్సరము పైగా నయ్యెను. వారిజాడ యిసుమాత్రము దెలియదుగదా!

(ఉ) మెత్తని వాఁడు భర్తయని । మేకొని యుండక గర్వ మొందుచున్
మొత్తితి వాని నెంతొ, యిట । మొత్తుకొనంగ ఫలంబు గల్గునే?
చిత్తము ఖేద మందెఁ; జనెఁ । జెచ్చెర భర్త ననుంవిడంగనాడుచున్;
అత్తఁడు నాకు నింక; గతి । యాలికి భర్తకు కంటె నేదియో!

భద్రు:— 'నా చూపాటు నంత పరదేశమునకు నే నిరంకుశ ప్రభువునే! యని మెతెన గోపుర శిఖరము మీఁద నిశి రాత్రి

వ్రాలి యొక్క గుడ్ల గూబ యనుకొను చుండునట. నీ విపుడు నిరంకుశైక ఛత్రపరిపాలకు రాలవై యుండియుఁ గౌనకములోఁ బుడక వంటి దాసు గారి జాడ నభిలషించెద వేల?

లీల:- అట్లనకుము.

సీ॥ స్త్ర్యంగములు గృహకృ । త్యములకు నను నయ్యె
పురుషాంగములు వీధి । కరయ! ననువు
స్త్రీ పరుగిడ లేదు । స్థిర చిత్తయును గాదు
కాన 'గృహిణి' పేరఁ । గాంత బిల్వఁగ;
ఎప్పుడో నొప్పుల । నింతులు గాంచఁగ,
నెప్పుడుఁ గాంచెద । రేపను పగలు;
ఇల్లు చిన్నది, వీథి । యొక్కఁడు పెద్దది
కాన స్త్రీ కంటె మ । గఁడధికుండు;

ఆ.వె॥ సాలు నంత వట్టు । సాధారణంబుగ
పడఁతి బిడ్డ నొకటి । బడయు కొఱస!
పురుషుఁడో జనకుఁడు । పుత్రు లెందరి కైన
సాలు లోనె సతులు । జాల గలుగ॥

భద్రు:- స్త్రీలు తమకు భర్తలు వశు లగుదు రని వృత్రాసురుఁ డిచ్చిన వరమున గర్వులై భర్తపై మోపెత్తి చూచు చుందురు. ఒకనిముసము భర్త లేకుండిన 'దేవుఁడో' యని యేడ్చెదరు.

లీలా:- నిరాశ్రయా న శోభంతే పండితా వనితా లతాః॥

భద్రు:- అననేమి తల్లీ!

లీలా:- క॥ అండ లతలకు నగంబు; మ
గండు వనితలకు; వదాన్య। ఘన భూజానుల్
పండితులకును; నిరాశ్రయ
పండిత వనితా లత లిలఁ। బడయవు శోభల్.

అని దాని భావము. ఇది సత్యము. స్త్రీల విషయములో మఱీ సత్యము. మఱియు 'దుష్ట స్త్రీ' దుష్ట వాహనమ్, మర్దయే ద్గుణ వర్ధయే' అను నట్లు మర్దించే లేక మాటకు ముందు భజ గోవిందాలు, భగవ ద్గీతలు చదువు చుండు సాధు భర్తల దుష్ట భార్యలు పై యెత్తు వా రగుటసామాన్యమె!

భద్ర:- పురుష శక్తి నిప్పటికి బాగుగనెఱింగినదానవై తివి!

లీలా:- నీ శ్లేషల కేమిలే! విను.

తే.గీ॥ ఎంతయో శ్రమ పడనిది। యితరు ధనము
తనదు చేతఁ జిక్కఁ గలదో। తలఁపఁ దరమె?
ఆర్జన మగనిది మఱి వ్య। యంబు స్త్రీది,
మగఁడు లేక సౌఖ్యంబు నే। మగువ గనునో!

భద్రు:- శామ శాస్త్రి గారూ మగవారేగా!

లీలా:- అయిన నేమి? ఆ.వె॥ పరుఁడు మగువ రూప। మరసి తనలుఁ గాని
దరికిఁ జేర కుండు। ధైర్య మొంద;
భర్త యట్లు గాక। వర్తించు సమముగ,
పత్ని చిక్కి యున్న। బలిసి యున్న॥

భద్రు:- బలిసి యుండగా సంపాదించు కొనిన చిల్లరి మల్లరి వస్తువులు చిక్కి నప్పుఁ డుపచరించవా?

లీలా:- 'ఆప దర్థం ధనం రక్షే' త్తను న్యాయమును నరిపెట్టితివి. కాని యిడాదగులు నగలా!

తే. గీ॥ అనప హార్యంబు, తేజోమ । యంబు, సర్వ
గుణములకు నలంకారంబు । గురుతరంబు,
భామలకుఁ బతిభక్తియె । పరమమైన
భూషణం బిట్టి దేపెఱ । భూషణంబు?

భద్రి:— పుట్టిన దాదియు మేడలో నుండు వాఁడు పూరింటిలోఁ గాఁపుర ముండు వఱకుఁ దన మేడ సుఖమును గుర్తింప లేఁడు.

లీలా:— పెద్దలు గని పెట్టిన గొప్ప రహస్యములను నీవు పల్కుచుంటివి. "నహి సుఖం దుఃఖై ర్వినా లభ్యతే!" యని యున్నది.

భద్రి:— ఆ। వె॥ మగని చాటు నడత । మాన్యమై యుండును;
మగఁడు లేని లోటు । మఱిఁ గలదె?
మగని వీడు పత్ని । మబ్బు వీడెడు నెండ
కుబుస మూడ్చు పాము । కొఱలు సమము.

అను రహస్యము నీ కిప్పటికిఁ దెలిసి నట్లున్నది. నీ విస్తృత పశ్చాత్తాపమునకుఁ గారణము,

ఆ। వె॥ ఎన్ని పన్నుగడలఁ । బన్నిన దానవో
పాఠశాల చదువుఁ । బడయు కతన!
'ఓసి! యెంత దాన । వో!' యని పొగడు భర్త
లేక బుగ్గి యయ్యె । లీల తెలివి!

యని నీ విపుడు గుర్తించుటయై యున్న దని యను కొనెదను.

లీలా:— అవును! గోడ లేనిదే చిత్తర్వు వ్రాయు టెట్లు! మీ యయ్య గారు మాత్రము తక్కువ యూహలు గల వారా?

ఆ। వె॥ ఆవ గింజ యంత । నవకొళ మబ్బిన
కొండ యంత నూహ । గూర్పఁ గలరు;
కామ శాస్త్రి తోడి । కార్యంబు వర్ణింప,
"ఊ" కొనందు నెంతొ । యొర్పు నొంది.

నీవంత కన్నపై యెత్తుఁ బన్నఁ గల దాన వైతివి. నేఁ డంతగా దాసు గారిని స్మరించు చుంటి వేల?

లీలా:— మనసు మనసుతో మాట లాడు నందురు. వారి కిని నాపై భ్రమ యారవలయు నిపుడు! వారు నా కన్నులఁ బడు నదృష్టము పట్టిన సత్య నారాయణ వ్రత మాచరించెద; వేంకటేశ్వర దీపారాధనముఁ జేసెద! వినాయకున కుండ్రాళ్లు పోసెద; సూర్యుని జూడనిదే భుజింప నని వ్రత మూనెద! భద్రా! ఆవచ్చు గడ్డం వా రెవరు? నా మ్రొక్కులు ఫలించి నట్లున్నవి!

భద్రి:— తొందర పడకు! 'మీబుచ్చన్నను గాకపోయిన నా కట్టి చెప్పులు నాకుఁ జాజ వేయుఁ' డన్నట్లగును.

(ప్రవేశము—దాసు)

మీకు వెయ్యేండ్లాయుస్సు. మాటలో వచ్చిరి. జాడ లేకుండఁ బోయిరే!

దాసు:— పోయి పోయి చివరకు బహ్వాంగబాదుఁ జేరితిని.

లీలా:— అక్కడి విశేషములు?

దాసు:— తే।గీ॥ అకసం బెక్కు డెంతెత్తొ । యక్కడంతె!
ఇక్కడ తలు పెంతగఁ గట్టొ । యక్క డంతె!
ఇక్క డెంత గట్టిదొ నేల । యక్కడంతె!
కాని యక్కడి మగవారిఁ । గాన మిచట!!

లీలా:— ఇల్లు వాఁకిలి వీడి యిన్నాళ్లెట్లుండఁ గలిఁగిరి?

దాసు:— అక్కడి వారు రేపు రే పనుచు జరిపి రానిచ్చిరి కారు.

లీలా:— భద్రా! పోయి నీళ్లక్రింద మంట వేయుము. మీ యయ్య గారు తలకుఁ బోసు కొనెదరు!

( భద్రుఁడు-నిష్క్రమణము )

అక్కడి సుందర స్త్రీలను జూచుచు నన్ను మఱచిరి, కాని ' నారీణాం భూషణం పతిః ' అను న్యాయమున నే నెంత కుందుదునో యని లేక పోయినది.

దాసు:- 'యది హృదయ మశుద్ధం తస్య సర్వం విరుద్ధమ్' కనుక నీవట్లంటివే కాని తమ భర్తలకె తాళ జాలని యక్కడి స్త్రీలలో, నేక పత్నీ వ్రతుఁడ నయ్యుఁ జాలని వాఁడ నగునన్ను జూచెదు వా రెవరు? నీకు సకలు సనాతనాచార ధర్మాసక్తుల పై నేరము లారోపించెదు నిజ మతాచార భ్రష్టాసక్తులుగలరు.

లీలా:- మీ మాట యేది?

దాసు:- మఱల రానేమో యని వారు లాగు కొనిరి. నేఁ జెప్పెడు పురాణమునకు వారంద రెంతో సంత సిల్లిరి.

లీలా:- మాట పోయిన పోవుగాక! మీరిల్లుఁ గదలరాదు.

ఆ. వె॥ భర్త యుండు చోటు । స్వర్గ తుల్యం బౌను;
భర్త లేని బ్రతుకు । పాడు బ్రతుకు;
భర్త నుండి స్త్రీకిఁ । బ్రాణ తుల్యం బగు;
భర్త వైన మిమ్ము । వదల, వదల॥

దాసు:- నిన్ను వెంటఁ గొంటినేని యొప్పు కొందు వన్న మాట!

లీలా:- వల్లితో గంప; నరునితో నీడ; మీతో నేను.

దాసు:- భద్రుని కి ల్లప్పగించి రేపు బయలు దేఱుదము. పంచమి మంచిది.

( నిష్క్రమణము )

---

అంకము 4.   రంగము 1.

విప్రి గృహము, వీధి యరుగు, బహిర్వంగ బాదు, రాత్రి.

పరివేశము: దాసు- నాంచారి, (ఒక వృద్ధ విశ్వస్త.)

నాంచారి:- దాసు గారూ! మీ దంపతులు యువకు లయ్యు నచు దినము నిట్లు పృథ క్శయ్య లందుదు రేలా?

దాసు:- అవ్వగారూ! మీరు నా మాతృ సములు. చెప్పెద. నా భార్య తోడి పొందు ప్రాణాంతకము.

( దాసు నిదుర పోవును. )

( ప్రవేశము- లీల )

లీల:- ( అవ్వ గారి ప్రక్కలోఁ గూర్చుండి ) ఇప్పటికి నింటి సవరింపు లయినవి. ఈపట్న వి శేషములను జెప్పుదురూ!

నాంచా:- పల్లె టూరంత వాస యోగ్యము పట్టణము కాదు. ఇక్కడ పోషు లెక్కువ. ఇక్కడి స్త్రీలు పని పాటలు లేక తవ తవ లాడుచు నుందురు. ఎన్నేళ్లు వచ్చినను పాత శాలల కేగుట మానరు. త త్ఫలంబుగ తక్కువ ఖర్చుతో నెక్కువ పరువును సంపాదింపఁ జూతురు, 'ధన మూల మిదం జగ' త్తను మాటే; దేవుఁడు దయ్యమూ సున్న, అతిథ్యభ్యాగతి

పూజ యనిన నేకయేడ్పే! తెల్లవారకుండా కాఫీ త్రాఁగి కూర్చుండు దాని చేతి యన్నముఁ దినుటకు దేవతార్చనకు నైవేద్యముఁ జేసెడి యే యతిథి వచ్చును? మఱియు నగ్రాశినీలు అన్య గృహ ప్రవేశినీలు. స్వాతంత్ర్యప్రియలు.

లీలా:- నాకు నిదుర వచ్చు చున్నది.

నాంచా:- నీది పల్లెటూరైనను నీకిట్టి మాటలు రుచింపవు గాఁబోలు! (లీల-నిష్క్రమణము)

ప్రవేశము- ఒక యువకుఁడు.

యువకుఁడు:- ఎంత బ్రతుకు బ్రతికిన నేమి చివరకు నవ్వ గారూ! యాసరా లేని వారైతిరి గదా! మీ వంటి వారికేమి యిడినను తక్కువే యగును. ఈమల్లు చాపును గట్టుకొనుఁడు. ఈ పటిక బెల్లమును బుగ్గను బెట్టుకొను చుండుఁడు!

నాంచా:- ఎంత దయఁగల వాఁడవు నాయనా! దీర్ఘాయుష్మంతుఁడవు గమ్ము.

యువ:- ఇంత వనుక మీ యొడిలోఁ గూర్చుండిన యాపె యెవతె?

నాంచా:- మీ వంటి వారికిఁ గబురందు నని కాబోలు నాయొడిలోఁ గూర్చుండు చుండును!

అయ్యో! అబ్బాయీ! ఆమెకు మాత్రము భ్రమ పడకుము. ఈపరుండిన వారే యామె భర్త. ఆమె పొందు క్షణిక మృత్యు కారణ మని యిప్పుడే యనిరి. ఆమె భర్తయె యామె కాశపడరు, నీ మేలుఁ గోరి చెప్పితిని.

యువ:- సెల విండు. (యువకుండు నిష్క్రమణము.)

దాసు:- (దొంగ నిదుర పోవుచు విని) అవ్వగారూ! ఎవ రడిగిన నట్లే చెప్పెను. లేకున్న పాపము! యువకులు నిష్కారణమూ చచ్చెదరు.

---

## అంకము 4 — రంగము 2. ఎడారి మందిరము.

### ప్రవేశము—లీల-దాసు.

లీలా:— 'దుష్టా భార్యా శఠో మిత్రం మృత్యు ర్గేవ న సంశయః' అను న్యాయమున దుష్ట భార్యలకు నేకడ చూచి నను బలి యైన వారే గాని తిన్నఁ బఱపిన పతులు లేరు మీ రొక్కరూ తప్ప. నాకు బుద్ధి పూర్తిగ వచ్చినది. 'అత్యుచ్ఛ్రయః పతన హేతుః' అనగా పెరుఁగుట విఱుఁగుట కొఱకే! ఇది నా చరిత్రము పట్ల నిజమైనది. 'బుద్ధిః కర్మానుసారిణీ' యను నట్లు నే నిక్కడ కేల రావలయును! 'అకసం బిక్క తెంతెంతో యక్కడంతే' అను మీ పద్యము నాకొంప ముంచినది. మీరు దేశాంతర గతులైనప్పుడు నేను పడిన పశ్చాత్తాపమును మంట గలిపినది. వచ్చితినిపో! ఆపాడు ముండ, నాంచారి, యొడిలో నే నేల కూర్చుండు చుండ వలయును? ఏదో నిర్వాహకము మండ బెట్టు నను కొంటిని. ఇప్పుడో కొండ నాలుకకు మందు వేయగా నున్న నాలుక కూడా యూడి నట్లయినది. నా కింత చేటునకు మూల మైనది.

నేను పురుష ద్వేషకు రాలనని చేసిన తమ యుపదేశము నీటిలోని చదురు మర్కటము పట్టు మండుయు మూలలు

సందులు గొందులు పాకి పాకి చివరకు రాజు గారి చెవిఁ గూడ సోఁకినది. తన పౌరులకు నావలనఁ గీడు మూఁడు నని భయపడి యీయమెడారిలో నేకాంత స్థలమునఁ గట్టఁ బడిన యీమందిరమున మనల నుంచి యెంత కాల మైన డి!

దాసు:- మన కాహార పదార్థములను దెచ్చు చుండిన రాజ భటు లెంత దూరములో నుండి సామగ్రిని కేక వేసి యప్ప గించి పోదురో! దొంగలకూ నీ యింపు భయము! కాకున్న నీపాటికి మన గొంతుకలను పిసికి వేయ కుందురా! మన యింటి మీఁద కాకి కూడా వ్రాలకున్నదే! నీవట్టి దాన వని రాజు గారికి చివరకు బాగుగ నచ్చఁ జేసి వెవరో!

లీలా:- ఎవరైన నేమి లెండి!

దాసు:- సర్దారు సాహేబు కాదూ!

లీలా:- మీరూ వాకపులు చేసి కొనుచునే యున్నారు. మీతోఁపి సాగినదని కులుకుచునే యున్నారు. మీ రూరిలో లేరు. వేఁటకుఁ బోగా యేపాము పీకినదో! తప్పించు కొని పాటి పోయి వచ్చి నచ్చులు కక్కుకొని, నా కర్మము కాలినది! మన గుమ్మములోఁ బడి చచ్చెను. అదిగో! నా వలననే చచ్చె నని పొగరు మోతు ముండాకొడుకు లదివరి కున్న బుకారు వృద్ధిఁ జేసిరి. గవర్నమెంటు సర్దారు చచ్చుటకుఁ గారణము నేనైతి నని రాజుగా రీవాసమును విధించిరి. నాతో పాటు మీకును.

దాసు:— షోసీ! యిక్కడనే యుందము.

లీలా:— నాకు బుద్ధిపూర్తిగ వచ్చినది. బుద్ధిరాకపోయినా, తమరు తక్కువ యుపాయముఁ గల వారు కనుకనా? తెప్పించ గలరు. నానా వర్ణీయుల మధ్య సంచరించు చుండగా నే నెంత పాపి నైతినో యీ గూఢ వాసమున గలిగిన పురుషా భావము వలన నంత యోగ్య చింతలు గల దాన నైతిని. రాజు గారికిఁ బో... తెలుసుఁడు. మన విలుగడ కొఱకు నెదురు చూచు చుందురు. మీ పాదముల యాన! పాతి వ్రత్యముఁ బూని, భారతీయ సతీమణిగా నుండుటయె యెక్కుడు మంచి దనియు నీ నవ నాగరికత చేటనియుఁ జాటి తెల్పెదను.

స్త్రీ స్వాతంత్ర్యమును ఖండించెదను. అరుంధతి మొద లగు పతివ్రితా శిరోమణుల వలన భర్తలకుఁ గలిగిన సుఖాదు లను మీకుఁ జేకూర్చెదను. ఆతిథ్య మిడెదను. కాఫీ విందులు మానెద. బాలికా పాఠ శాలలను బునాదులతోఁ బెల్లగించి పాఱవేయింపఁ దగునని భారతీయులకుఁ దోపించెద; మీరు మహా పండితులు. మీ వలన నా కిసుమంతయు నలజడి యెన్నడూ కలుగలేదు. కాని నావలన మీ రెక్కువ యాయాసపడిరి.

'జననీ జన్మ భూమిశ్చ స్వర్గాదపి గరీయసీ' యందురు. నేఁగిరము నింటికిఁ గొంపోవుఁడు. మీకు సాష్టాంగ నమస్కారముఁ జేసెద.

దాసు:- సప్తమీ యాది వారమున బయలు దేరి పోదము.

( నిష్క్రమణము )

---

అంకము 5. రంగము 1. దాసు గృహము.

పరివేశము— లీల, భద్రుఁడు.

భద్రు:— ఆ। వె॥ ఆ సమాయకులని । తలంచెద రెల్లెడ
దాసు కంటె గడుసు । ధరణిఁ గలడె?
పత్ని వ్యభిచరింపఁ । బాటింపని మగలె
కాని తిన్నఁ బఱచు । ఘనులు గలరె?

కం॥ ఏదియు మంచి కొఱకు నగు;
నీదు మనంబు బదిల పడె; । నియమము గుదిరెన్;
నీ దారి తిన్న నయ్యెను;
మోదం బిప్పుడు లభించెఁ । బూర్తిగ నాకున్!

లీలా:— సంగతి సందర్భములు మీ యయ్య గారి వలన వూసగ్రుచ్చి నట్లు విని నట్లున్నది.

భద్రు:- ఆ।వె॥ నరుల కామ తిమిర । నాశనం బగును జి
తేంద్రియ రవి యుదయ । మెద నొదవ; వి
వాహ మనినఁ గామ । వాద్యముఁ జోఁ గొట్టుఁ
గొట్టు కొలఁది డోలు । గోల నిడదె?

సంఘ సంస్కర్తల మనుకొనెడు వారీరహస్యము నీవ ణ్మాత్రము దెలిసి కొనలేక బోడి చేతులకు గాజుల చప్పుడుఁ దెప్పించుటకు నహర్నిశములు కృషి సల్పుచున్నారు.

లీలా:— నీమాట సత్యము! సత్యము!

తే. గీ॥ భర్తృ సహితనై వచ్చెదు । పద్ధతి నయ్యు,
వ్యభిచరించిలేఁ జిత్తంబు । నణచుకొనక
భర్త మద మణచు నని సం । స్కర్త లనుట,
వెఱ్ఱి మాటయే యగుఁ గాని । వేఱు గాదు!

భద్రు:— మఱి యెందు వలన?

లీల:— నానా జాతీయుల మధ్యను నిజ గృహ బాహ్యమందును అనగా పాఠశాల లందు స్వయం ప్రజ్ఞను గలిగిన స్త్రీలు విద్య లభ్యసించిన కారణమున నింద్రియ నిగ్రహము కుదురని పరిస్థితులలో సంచరించి నందు వలన.

భద్రుఁడు— ఈ సిద్ధాంతము నందఱొప్పు కొనెదరా!

లీల:— విను! నచ్చఁ జెప్పెద! స్త్రీలకు లజ్జా కామముల ననుసరించి మూఁడవస్థలు గలవు. మొదటిది:— బాలికయై యుండ, కామ మల్పము, లజ్జ యధికము. రెండవది:-వయస్సు మీఱు కొలఁది లజ్జా కామములు సమ మగును. మూఁడవది:-వయస్సు మఱలు కొలఁది లజ్జ కృశించును. 'లజ్జా స్త్రీభూషణ' మను న్యాయమున లజ్జా పూరితురాలుగ కన్యకను నుంచుట 'పితా రక్షతి కౌమారే' యను విధిని బట్టి జననీ జనకుల ముఖ్య కర్తవ్యము. ఈ లజ్జా పరిపూర్ణమె బాలికా భవిష్యత్సుఖ జీవన భవనమునకుఁ బునాది. బాలికకు లజ్జ స్వభావ జనితము. భర్తృ కదాచిద్దర్శన స్పర్శ సాంగత్య పరంపరల వలనఁ గాలక్రమమున స్త్రీకి వయస్సు మీఱు కొలఁది స్వల్ప స్వల్పముగా లజ్జ గృశించును. చివరకు సంతాన విరో[illegible] వయస్సునను, అనగా [illegible] మూఁడవ [illegible] స్వల్పమగును.

కాని పాఠశాలల యందును పాఠశాలా మార్గమందును నానా పురుష నిర్లజ్జా స్త్రీ దర్శన స్పర్శ సాంగత్య వీక్షణముల వలన నొక పెట్టున నేనీ లజ్జ పూర్తిగ నశించిన దాననైతిని. ఇట్లు మొదటి యవస్థ నుండి రెండవ దానిలోనికి క్షణికములో నెదిగితి. ఈ రెండవ యవస్థలోఁ గునికి పాట్లు పడుచుఁ గూర్చుంటి ననుకొంటివా! మూఁడవ యవస్థలోనికి దటాలున డబుల్ గంతు వేసితిని.

కాళ్లు లేని వానికిఁ జేతులు బలియు నట్లు నన్ను వీడిన లజ్జా స్థానములోఁ గామము బలిసి హెచ్చెను. చిన్నప్పటి నుండియు నేను లజ్జా విహీ నావస్థలో నుండుటం జేసి, నాయధిక కామానుభవము కంటె నెక్కువది పాఠశాలలను నేగని యే వనిత గలుఁగఁ గలదు? ఇట్లు చేతులారా హెచ్చిల్లఁ బెట్టిన యీ యధిక కామము నుపసంహరించుటకే కదా యిన్ని వంకర టింకర పోకడలు పోతిని. ఇందులకు పాఠశాలలు కారణ మని నచ్చినదా? అందుల కేగుటకుఁ మాయమ్మా నీవూ మఱియుఁ బాఠశాలలలోఁ జదువు చున్న కన్యకలను మాత్రమె వివాహ మాడెద మను నింగ్లీషు విద్య నభ్యసించు వెకిలి విద్యార్థులుత్తర వాదులు.

భద్రు:— నీతో సరి తూఁగని భర్తయును!

లీలా:— నో! నో! అటులయిన నాకు నింత దనుక లభ్యమైన విటులలో నొకఁడును నాకు సముఁడు కాఁ డనియా?

భద్రు:— కామ శాస్త్రి గారి కన్నుఁ గట్టి వా రెవరు?

లీలా: వానితో నాగక మతి యొకనికి స్వాగతమేల యిడి తివి? బహిర్గంగ బాదున కేల వయన మైతివి?

భద్రు:– కాన నీ చెడ్డ దారికి లజ్జా వినాశనము, లజ్జా వినాశనమునకుం బాఠశాలలు హేతు ర్భూతములు.

లీలా:– యెస్! విమర్శక బుద్ధితో యోచించెడు వా రెల్ల రొప్పు కొనెదరు. మీ యయ్య గారి కేమి లోటు? ఆస్తి వం తులు, విద్యావంతులు, న్యాయవంతులు, ఏక పత్నీవ్రత వం తులు, దయా వంతులు, సత్కుల వంతులు, లోక జ్ఞాన వం తులు, రూపవంతులు, యౌవన వంతులు, ఇట్టికోటి వంతులు గల వారికి బూటక నవ నాగరికత వేష భాషలు లేవనెడు కించి త్కారణమున దృణీకరించుట కన్న బుద్ధి తక్కువ గలదే! నిజముగా వారికే నేను సరి యగు దానను గాను!

భద్రు:– బాలికలకుం బర పురుష నిర్లజ్జాస్త్రీ సాంగత్య భావ దోషములు బాఠశాలలకు నేగుచోం గలుంగక మానవు.

లీలా:– పర పురుష సాంగత్య భావ దోషములు గలుంగని పడంతికి భర్త యెట్టి కురూపి యైనను నవ మన్మథుండె! కనుక స్వయంవరములను బ్రోత్సహించు సంఘసంస్కర్తలునింద్యులు.

భద్రు:–భారతీయులలో క్షత్రియులకు స్వయంవరములు శాస్త్రీయములు గదా!

లీలా: రఘు వంశములోం బంచమ సర్గ యందు "తత్ర స్వయంవర సమాహృత రాజ లోక" మని యున్నది. అనగాం

దండిచే నాహ్వానింపఁ బడిన వరులలో మాత్రమొకరిని వధు వెన్నుకొన వలయునేకాని ఇతరులలోఁ గాదు. నిరంకుశ స్వయం వరము క్షత్రియులకును లేదు. బర్మాదేశములోఁ గలదు. సంఘ సంస్కర్తల మను వారిలోఁ గలదు. అప్పుడు నానాజాతీయులు తోడల్లు రగుదురు.

భద్రు:- స్త్రీలకు గృహ కారాగారము మీరు విధించినను నిప్పటి స్త్రీ సామాన్య లోక మొప్పు కొందురా?

లీలా:- స్త్రీ పురుష నైజములు దెలియక యొప్పుకొనరు. వారి వారి తత్వములను విపుల పఱచెదను. విను! స్త్రీ పురుషు లలో నొకరికి వలను బడనిది, మఱి యొకరికి వలను బడును. కాన యిష్ట కార్య సిద్ధికి నన్యోన్య సుఖమునకు స్త్రీ పురుషైక్య ము ముఖ్యము.

విమర్శన, సాహసము, న్యాయ రణోత్సాహము, జయాభి లాష, సృష్టి వృద్ధ్యనుకూ లోద్యమము, మున్నగు వానికి నను వైనది పురుష శక్తి.

యుద్ధమునకుఁ గాదు, గృహపాలనకు; సృష్టించుటకుఁగాదు పోషించుటకు పెంచుటకును; అమలు జరుపుటకుఁ గాదు, మం త్రాంగముఁ జేయుటకు; సంపాదించుటకుఁ గాదు, వస్తువుల యథావిధి స్థాన మరసి సంబళించుటకు; స్తుతింపఁ బడుటకుఁ గాదు, స్తుతించుటకు; ఇత్యాది నైజములకు స్త్రీ శక్తి లోనై నది. మఱియుఁ దప్పుటకుఁ బడుటకు నోముటకు, ననువైనవి

కావు స్త్రీ దేహ స్వభావములు.

స్వయం కృతాపరాధము, భ్రాంతి, యపాయము, కష్టనిష్ఠు రములు మొదలగు వానికి నవకాశ మిడనిది గృహము. వివిధ వస్తుజన భరితమై మనో దుర్బలు రాండ్రగు నబలలకు వెఱ్ఱులు బుట్టించు నట్టి వీధి యుండును. కాన స్త్రీ గృహిణి యయ్యెను. స్త్రీవీధి కెక్కిన యెడల గృహము పాడు పడుటకె కాని వీధిలోని వ్యాపారములు బాగు పడుటకుఁ గాదు.

తే॥గీ॥ అతుల చపల మతి యతివ । యగుట, ధర్మ
శృంఖలా బద్ధు రాలుగఁ । జేసి యిల్లుఁ
జక్కఁ దీర్చు విధుల నెల్లఁ । జక్క నేర్పు
విజిత చిత్తయై పతి భక్తి । వెలయఁ బడఁతి॥

శ్రీ కృష్ణ భగవానులును స్త్రీ పై నెక్కువ బాధ్యత పెట్టు టను "స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణ సంకరః" అను వాక్యమున సూచించెను.

భద్రుడు:— అదిగో! కామశాస్త్రి గారు రెగిణి యెగిణి వచ్చుచున్నారు. (ప్రవేశము— కామశాస్త్రి గారు) కామశాస్త్రి గారూ! దయ సేయుఁడు.

కామ:— ముఖవర్చస్సు మనోవృత్తులఁ బ్రకటించును. ఈమె పునర్దర్శనముచే నేఁడు నాయుత్సాహము నీళ్లు గాఱినది. శృంగార రసము పోయి భక్తిరసము నామనసున నంకురించి యామెకు దండముఁ బెట్ట బుద్ధి గలుఁగుచున్నది.

భద్రు:— నమస్కార మనియేనా తమ యుద్దేశము?

లీలా:— శాస్త్రిగారూ! సనాతనాచార ధర్మములు కాని వనుకొని నిజముగాఁ గాని వానిఁ దగిలి చెడుటయు, దోఁక తెగిన నక్కను బోలెడు వా రగుటయు, మాత్సర్య పూరితు లగుటయుఁ దోఁడేటి వాదనలను సాధువు లను మేక పిల్లలపైఁ బ్రయోగించి హింసించుటయును, వారిని దమ లెవెల్(మట్టము) లోనికి దిగలాగుటకు నభినందించుటయు నిత్యాది కృత్రిమ సం చారులె లేక పోయిన యనున కంతయుఁ దీలుబడిరెను! చిన్న చిల్లి పెద్ద యోడను ముంచు నట్లాచారములోఁ [illegible] చిన్న లోపము నంతమును ధ్వంసముఁ జేయును.

భద్రుఁడు:— తాము గమనింపక దాంభికాచారముఁ బ్రక టించు వారు యోగ్యులును, దా మెంత గమనించెదరో యంత వఱకె కనఁబడు నమ్రభావు లయోగ్యులూనా?

లీలా:- మతాచారములను సెంటుపెర్సెంటు (నూటికి నూరు)గమనింపఁ గల వా రేపుతములోనూ లేరు. కాని గమ్య స్థానమును ధ్వంసముఁ జేయరాదు. ఒకఁడు స్వవశత్వము లో సాగించు కొనుటకు వలను పడునంత యాచారమును సాగించు కొనుచు నింకను నెక్కువ మెట్టును మెట్టుటకు యత్నింప వల యును. పూర్తి కర్మాచరణము వలను— పడనందున కొద్దియో గొప్పయో నరులు పాపులె! కనుక "పాపోహం పాపకర్మాహం పాపాత్మా పాపసంభవః పాహిమాం కృపయాదేవ..." అని దేవుని బ్రార్థించెదరు.

తా మేకాంతమునఁ బ్రిమాద వశమునఁ బాపముఁ జేసియు నితరులకుఁ దత్కృత్యాదర్శకులు గాకుండు వా రొక రకము.

తెలిసియు తెలియకయు పాపముఁ జేయుచు నదియె యోగ్యమని ' నదుఃఖం బహుభిస్సహ ' యను న్యాయమున నితరులకుఁ దోపించెడు రీతి సంచరించుచు, బోధించుచుఁ బ్రోత్సహించుచు నీమూలమునఁ దాము చెడుచు లోకమును జెఱుపుచుండు వారు రెండవ రకము. వీరు ద్విరుక్త పాపులు. వీరి పాపమునకుఁ బ్రాయశ్చిత్తము లేదు. వరవిక్రియవు టాకీసు పుత్రికా మోహావేశుఁడైన భారుణోత్తమరావు లుద్భాగేసర చక్రవర్తియైన లింగరా జాంశులె. మూఁడవ వారు వీరిలో లేరు. వీరి జన్మ చీమ దోమ నల్లి తేలు వేశ్య దొంగ మున్నగు వానివలె పుణ్యసంపాదనమునకు ముక్తికొఱకుఁగాదు, పరులఁ బీడించుట కొఱకె. తమ పితరుల యోగ్యాచార విరుద్ధ సంచారులకు మనువు పరాశరాదు లల్పజ్ఞులుగఁ దోఁచెదరు. వీరిని నిజశాఖావిఘాతకు లనఁ దగును. ఏలన— ఆర్షమత విరుద్ధములైన విధవా యువతీ వివాహములఁ బ్రిబోధించుచు నామోదించుచు, నిష్కపట వేషాచారులవలె పుడిఁ గట్టి చెంబులు చేఁబట్టి సనాతనిష్ఠుల సహబంతులకు వియ్యంబులకు సిద్ధమగుదురు.

జగద్గురువు శ్రీశంకరాచార్యస్వామి శాపమున వేద బాహ్యులైన దాక్షిణాత్యులు పంచమ దేవాలయ ప్రవేశము నంగీకరించిరను వార్త ప్రకటించి, వీరు 'పరభిద్రాను సారిణః' అను న్యాయబద్ధులై మూలవిగ్రహ పవిత్ర దేవాలయము

టను బాడు పఱచి పంచములను డాకి గాంధిగారి షేక్‌హ్యాం డున్నొఱకు నెదురు చూచెదరు. ఇట్టి వానిని గోముఖ వ్యాఘ్ర ములనుటకు సందియింప నేల?

సనాతనిష్ఠులందఱిని వసిష్ఠపాత్రలోను మత సంస్కర్తల మనెడి వారందఱిని విశ్వామిత్ర పాత్రలోను పురాణేతి హాసము లన్నియుఁ బొందు పఱచి విశదీకరించినవి. బ్రాహ్మణబీజసంభవుఁ డయ్యును జన్మకు క్షేత్రదోషము పట్టిన కతమున విశ్వామి త్రుఁడు వసిష్ఠునితోఁ దులఁదూఁగుట వాంఛించి సమఁడు కాలేక యుడుకఁ దెచ్చికొని, యొకసి కొంపఁ దగులఁ బెట్టి కొంపలేని వాఁ డానందించెడు భంగి, వానిపై నేరారోపణముఁ జేసి యానందించు వాఁడు. ప్రేతమాంస భక్షకులైన మాది గలకు నస్పృశ్యతఁ బోఁగొట్టుటకై హరిశ్చంద్ర వసిష్ఠాదులను వివాహ మాఁడ మనెడు వాఁడు. పవిత్రులపై కోడి గ్రుడ్డున కీకలు దీయఁ జూచువాఁడు. వేయేల! వసిష్ఠాదులకు విశ్వామి త్రుఁడు క్రీనీడ; సనాతనిష్ఠులకుఁ బ్రస్తుత పురశూద్రులలో విశ్వామిత్రాంశజులు క్రీనీడ; భారతీయ జాతు లందఱిలోను తక్కువ పాడుఁగల బ్రాహ్మణు లనినఁ గిట్టని వానికిఁ గిట్టు వారుందురే! మాంసభక్షకు లెముకలు తమమెడఁ దాల్తురు. కాని వీరు తమ దురాచారములను జిహ్వను దాల్చెదరు. నేను పాఠశాలావిద్య నభ్యసించిన దానికంటె వీరి నామస్మరణమున నెక్కుడు పాతకు రాలైతిని. వారి ప్రశంస నీక ముందెన్న డెత్తఁబోను.

భద్రుః— మీ పునరర్పణమునకుఁ గొండంత యాశతో,

శాస్త్రి గారు రాఁగా నిట్లుఁ ద్రుంపి వేయు నగునే!

లీలా:— రౌరవ వాది నరకములలో నెట్టగాఁ గాలినయినుప స్తంభములకు యముఁడు మా యిరువురను నంటఁ దీసి కట్టి నప్పుడు మాత్రమె మా పునస్సంగమము.

లోగడ కం॥ కామాంధత నొందుటచే
నే మాడితిఁ గష్ట పడితి । ని; తలుమఁ బడితిన్;
నా మాట విశ్వసింపుఁడు,
కామ వినాశనమున జిత । కాంతను నైతిన్॥

కామ:— నాఁడు నీ వాబరణి సందేశం బందఁ జేయు వలసు నా భార్య సవతి లేని పత్ని.

భద్రు:— భోజ నాదులకు మి మ్మోస్నిరో సారులు మిత్రు లగుటచేఁ దాసుగారుబిల్వకున్ననాబరణిసందేశము మీకందునే!

సీ॥ "మిత్రుఁడా! ర"మ్మను । మిత్రుని సతిఁ గూడి
మిత్రఘాతకుఁ డౌను । మిండగాఁడు
అగ్ని సాక్షిగఁ బెండ్లి । యాడిన పత్నిని
మిథ్యాసతిగఁ జేయు । మిండ గాఁడు
నిజపుత్రి పోషణ । నీచముగఁ దలఁచి
మేపు లంజల సంతు । మిండగాఁడు
భీరుండు నయ్యును । ధీరుఁడై యొంటరి
మెలఁగుఁ జీఁకటి నైన । మిండ గాఁడు
ఆ॥ వె॥ లంజె మఱుఁగు నట్టి । లంజెగాం డొందరె
మనసు దుడుకు లోకు । ల నిరసనము
నిజసతి యుసురు: సుత । నింద యాయువు పోక
ధనవినాశ నంబు । ధరణి యందు॥

కామ:— నిజము! నిజము!

భద్రుఁడు:— మఱియు—

ఆ॥వె॥ కులటఁ గూడఁ గోరి । క్రుంకించు దినమంత
క్షణిక విషయ సుఖముఁ । గనుట కొఱకు;
శర్మము తోడ గూడు । క్షణిక సౌఖ్యము మాని
తిరుగ మాన వుండు । నరయు సుఖము॥

కామ:— మానవులు జితేంద్రియులు గావలయును. కాకున్న పశు ప్రాయులె!

భద్రుఁడు:— జితేంద్రియులు గాని మిండగాండ్లకు

ఆ॥వె॥ గుల్ల యొడలు; జేబు । యిల్లు వాకిళ్లును
గుల్ల; కడుపు సంతు । గుల్ల; భార్య
గుల్ల ;పరువు ఖ్యాతి గుల్ల; యున్నయు గుల్ల
మిండగాని కెపుడు । మెండుగాను;

కామ:— సత్సంగమమున జితేంద్రియుఁడ నైతివి.

భద్రు:— నేనుమాత్రము.

సీ॥ పెఱదార గమనమ । పేక్షించెదనుగాని
భయముఁ లెన్నియొపొందిఁ । పాఱువాఁడ
దాసితోఁగూడిన । దాగదు మానము
వేశ్యతోఁగలిసిన । వెడలు ధనము;
విధవ రాలిని జేర । విహతమౌనాయువు;
కులకాంత పొందుతోఁ । గూలునన్ని;

తే॥గీ॥ వేశ్యఁబలు పురవిటులు । వేఁపుచుండ,
కుల సతిక్రిఁబతి రాకయు । దెలియకుంట,
చెమట లూరఁబొందెడు రతి । చెదరిపోవు;
నాశఁబడనేల పెఱకాంత । కనుచుఁదలఁతు॥

కామ;— క॥ భారత యుద్ధం బుండునె
యారయ! ద్రౌపది జనించి । యపు డుండనికిన్?

జారుఁ డగునె దేవేంద్రుం
డౌర! యహల్య జనియించి । యపు డుండమికిన్?

తలంచు కొని సంతసనె పరితాపము, కంటఁ బడి సంతసనెచిత్త విభ్రమము, తాఁకి నంతనె మోహాముసు గలిగించి వెఱ్ఱు లెత్తించునది యాఁడుదియైయుండ నామెకుఁ బ్రియురా లను బిరు దేలవి యిచ్చి యుండెనో!

భద్రు:- ఇయ్యకేమి? కంటఁ బడు నంతనె యమృతము నోటికిఁ దగిలి న ట్లుండును; రవంత కనుమఱుఁ గయ్యెనో కాల కూట విషముఁ ద్రాగి నట్లు మనసు గిల గిలఁ గొట్టు కొనును; స్త్రీ యెంత ప్రియురాలు కాక పోయిన నిట్లగునా?

శాస్త్రి:- నరకమునకుఁ ద్రోవ; సాహసమున కాట పట్టు; మాయల కాకరము; బడాయిలకుఁ బుట్ట; పాపములకు నిధి; విశ్వాస హీనతకుఁ బట్టుకొమ్మ; అమృత స్వరూపమునఁ గని పించు కాల కూటము స్త్రీ. 'యోషితాం హృది హాలాహల మేవ కేవలమ్॥'

లీలా:_ నో! నో! అందఱూ కారు.పలుజాతీయుల మధ్యను నిజగృహ బాహ్యమునను స్వేచ్ఛగాఁ దిరుగాడెడు స్వయంప్రజ్ఞా స్త్రీలు మాత్రమె. తక్కిన వా రెప్పుడూ యమృతస్వరూపులె!

భద్రుడు:- మీానవరణ నామోదించితిని. ప్రపంచక మను జలమున సుందర వదనారవింద మను నెఱఁ గ్రుచ్చి పాఠశాలా బాలిక యను గాలమును మన్మథుఁ డను పల్లెవాఁడు విసరగ నామెఱ కాసపడి గాలమున నవనాగరిక బాలురను చేపలను

దగుల్కొనఁ జేసి పిమ్మట మోహ మను మంటలో వేయించు చుండును.

కామశాస్త్రి:- పాఠశాలానుభవముఁ గల స్త్రీలు మొలక నగవు, కృత్రిమ లజ్జాభినయ విలాసములు, క్రీగంటి చూపులు, మృదుమధుర వాక్కులు, అసూయ, యొయ్యారపు నడకలు, వంకర దిద్దుపాటు కనుబొమలు కలిగి యొకసారి భయం బొక సారి మహోత్సాహ మొకసారి కోంటెతనము వెల్లడించుచు, దమ మీఁదనుండి వీచెడు గాలి వలపు గైకొనఁ దగిన ధనియు దమ మృదు మధుర స్వరము హాయిగా విన దగిన దనియు, దమ శరీరముస్పర్శసుఖ మొసంగు నదనియు తమ యధ రామృత మారగించుట కెక్కువ రుచి యైన దనియుఁ దమ పదుఁచు దన మానందింపఁ దగిన దనియుఁ దమ విభ్రమములె న ర్వోత్కృష్టము లనియుఁ దోపించుచు స్వర్గాధి పతి యైన యింద్రుని వంటి బల పరాక్రమ శాలిచే నైన 'జితోస్మి' యని పించఁ గల తాము సబలలుగాకయబల లెట్లగుదు మని ధిక్కరింతురు. "శాస్త్రము లేటికి కామబాధ కున్" అని పురుషులకుఁ దోపించెదరు.

భద్రుఁడు:- అవునండి! కని పించు వఱకు నొక సారి కంటఁ బడినఁ జాలుననియు కనిపించిన తరువాత నొక సారి కౌగలించు కొన వలయు ననియు గౌగలించు యోగ్యత గలిగిన నప్పు డాశరీరము లాలాగుననే యుండిన బాగుండు ననియు యువకులకు దోపించు నంత చవాలు పాఠశాలలలో జదువు బాలికలకు నొంటఁ బట్టును.

------

లీలా:- పాఠశాలా విద్య బాలికలకు నీతిని బోఁగొట్టి మంచి చెడ్డ విచక్షణ దూరముఁ జేసి యజ్ఞానమున ముంచి దుస్సహ వాసముఁ జేగూర్చి పిమ్మట మన్మథ వికారమునముంచి యెన్ని దురవస్థల నైనఁ దెచ్చి పెట్టును.

కామః-స్వేచ్ఛా విహార మునకు సంకెలయైన స్త్రీ లేకుండినచో పవిత్రి మైన గంగా జలములు, తపోయోగ్య మైనపర్వత ప్రదేశములు గొండ గుహలు మహారణ్యములు, విడిచి నీచ మైన రాజ సేవ నెవ్వఁ డంగీక రించును?

భద్రుః- పాఠశాలల యందు స్వయం ప్రజ్ఞఁగల వనితయను మన్మథాగ్ని, మోహ పీడితులైన నవనాగరికుల యౌవనము లను నింధనములుగా కొని వృద్ధిఁగాంచు చున్నది.

లీలా:- నిజము! నే నుత్తమోత్తమ జననీ జనకుల కడుపునఁ బుట్టితిని. పవిత్రిమైన యత్తమామల గృహముమెట్టితిని. ఈడూ జోడూ గల చక్కని వరుని వివాహ మాడితిని. నావివాహ ములో నన్నశాంతి యంత మైనది. అయినను నింద్యచరిత్రి నైతిని. నానావర్ణజుల మధ్యను నిజగృహ బాహ్యమందు నన గాఁ బాఠశాలల స్వయం ప్రిజ్ఞఁ గల నే నభ్యసించిన విద్యలో నెంత ఘూ టున్నదో! నాపవిత్ర భర్తను నిరసించి పైయెత్తుగఁ బ్రివర్తించితిని.

"స్త్రీపుం వచ్చ ప్రభవతి గృహే తస్య గేహం వినష్టమ్"

భద్రుఁడు:— అన నేమిటె, తల్లీ!

లీలా:- క॥ పురుషుని వలె సంచారం

బరుమగ నేగృహము నందు । నాఁడుది నేయున్,

దొరలును గృహమువ నష్టము,
పొరయు వినాశంబు బంధు । పుత్రాదులకున్॥

కనుక తే॥ గీ॥ ఒక్క మన్ననతో నున్న । నొల్ల కున్న
కరము నెయ్యుఁడై యున్నను । గాక యున్న
మగఁడె గతిగాగ నుండును । మాన వతికి,
పాఠ శాలలో జదువామె । బడయ కున్న!

భద్రః— తే॥గీ॥ పాఠ శాలలో విద్యలు । బడసి జదుఁ
బతికిఁ బ్రీతి కూలు రాలయి । పరఁగు చుంద్రు;
అత్త మామల హిత బోధ । నధిగ మించు;
గూలి యనుభవించు నరక । ఘోర గతుల॥

కాముః— కం॥ నడనడి కొఱ గాకున్నను,
బడుగైనఁ గురూపి యైనఁ । బామరుఁ డైనన్
జడుఁ డైన రోగి యైనను
విడుచుట మర్యాద గాదు । విభు నంగనకున్॥

పరివేశము—దాసు.

భద్రః— ఇంత దనుక నెక్క డుండిరి?

దాసుః— ఈప్రక్క గదిలోఁ బుస్తకముఁ జూచు కొను చుంటిని. మీ యమ్మ గారు, భద్రా! పలువుర మధ్య మం దుండగ నెట్లున్నదో బహూవంగ శాద్ధులో గడు వివిక్తముగ కాఁపుర మొందిన పిదప నెట్టిదిగా మాఱినదో గుర్తించెడు వారు పలు జాతీయుల మధ్యను నిజ గృహ బాహ్య మందును విరుద్ధాచారోపాధ్యాయుల కడను తమ బాలికలకు విద్య గఱపుటయు నట్టి విద్యఁ బడసిన బాలికలను భారతీయ వరులు వివాహ మాడుటయు మాను దురు. భారతీయులు తమప్రస్తుత

యుచ్ఛ్రయ పతనమునకు బాలికా పాఠశాలలే ముసలమని మన సార నమ్మి తమ యిండ్లపై 'పాఠశాలల చదువులేల బాలికలకు!' అని వ్రాసిన జెండాలను విరామము లేక యెగుర వేయుదురు గాక!

భద్ర:- మీ సలిశి నాగంతకముగా సంభవించిన దుష్టత్వమును దిద్దఁ బలికిన మగ వారైతిరి.

దాసు:- "అంగార శ్శత ధౌతేన మలినత్వం నముఞ్చతి" అందురు. మీయమ్మగారు పుట్టుకచే బొగ్గువలె మలినత్వముఁ గలది కాదు. జనని నటన పాఠశాలా విద్యయను మసి యావరించుకొనిన మణి. బహ్వాంగబాహు వాసమను ధౌతముచే మలినత్వము వీడిన దయ్యెను. భారతీయ జననీ జనకులెంత ముందైనను తమ బాలికామణులకిట్టి మాలిన్య మంటకుండఁ జేయుదురు గాక! ఉత్పథప్రతి పన్నలు గాకుండఁ గాపాడుదురు గాక! "త్యజ దుర్జన సంసర్గ"మను హితోపదేశమును తమ పుత్రికల కననిమిషము జ్ఞాపకముఁ జేయుదురు గాక! తమ తమ గమ్యగృహాచారములను నిల్పుకొందురు గాక!

---

## గద్యము.

ఇది శ్రీ పరమేశ్వర కరుణా లబ్ధ కవితా ధురీణ శ్రీ గురువరం దర్భా జగన్నాథ సూరి చరణారవింద భక్త్యాభరణ శ్రీవత్స గోత్ర పవిత్ర శ్రీ తెన్నేటి వియ్యమాంబా- మహాదేవావధాని పుత్ర అత్తిలి నామ గ్రామ వాస్తవ్య బుధ జన విధేయ దీక్షితీయ మను తత్స మాఖ్యిక

పర్యాయ పద నానార్థ నిఘంటు, వార్యోక్తి మంజరి, కపి కర దీపి కాద్యనేక గ్రంథ రచయిత, వేంకట దీక్షిత నామ ధేయ ప్రణీతం బైన లీలావతీ నాటక మందు లీలావతీ వ రాన్వేష ణము, వివాహ విఘ్న నాశనము, బాలికా పాఠ శాలలను గురించి చర్చ, లీలావతీ కాపురము, భర్త యనుమానములు అతిథి నిరాకరణము, బహిర్వంగ బాదు వాసము, లీలావతీ పశ్చాత్తాపము, సతీత్వ ప్రకటన, మున్నగు 'బాలశాలల చదువులా బాలికలకు!' నని సిద్ధాంతీకరించు విషయములన్నియుఁ గల పంచాంకములు సమాప్తము.

— శ్రీ భారతీయ పతివ్రతా శిరో మణ్యర్పణ మస్తు. —

సం పూ ర్ణ ము.

---

| పే. | పం. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 1 | 3 | కకలకు | కలకు |
| 14 | 2 | పాఠి | పాఠ |
| 24 | 17 | కట్న కానుకలింత:- | గోరంత గట్న ముల్ |
| 29 | 16 | నిప్పు | ఇప్పు |
| 46 | 9 | క్షత్రాః, క్షత్రియ్యాః:- | క్షత్రియా |
| 56 | 17 | యుచ్ఛ | యుచ్చ |
| 59 | 16 | కాతారు | కాతేరు |
| 64 | 6 | నసము | నయనము |
| 66 | 23 | మిగుల | మిగల |
| 73 | 4 | పెట్టునేఁడె | నేఁడేపెట్టు |
| 80 | 18 | వృత్రాసురాంతకునికై | బ్రహ్మ యిచ్చు |
| 96 | 5 | హిసించు | హింసించు |
| 104 | 12 | య్తైన | యైన |

---

☞ అంకం 1 రంగం 6 ను విడిచినను నాటక కథా సరళి చెడదు. నటకులు తమ వ్యవధి ననుసరించి ప్రదర్శింతురు గాత!

యుచ్ఛ్రయ పతనములకు బాలికా పాఠ శాలలే మూలమని మన సార నమ్మి తమ యిండ్లపై 'పాఠ శాలల చదువులేల బాలికలకు!' అని వ్రాసిన జెండాలను విరామము లేక మెగుల నేయుదురు గాక!

భద్రః:— మీ సతిని నాగంతకముగా సంభావించిన దుష్టత్వములను దిన్నఁ బడిసిన మగ వారైతిరి.

దాసు:- "అంగార శ్శత ధౌతేన మలినత్వం నముఞ్చతి" అని యందురు. మీయమ్మగారు పుట్టుకచే బొగ్గువలె మలినత్వముఁ గలది కాదు. జనని వలన పాఠశాలా విద్యయను మసి యావరించు కొనిన మణి. బహిరంగబాహు వాసము ధౌతముచే మలినత్వము వీడిన దయ్యెను. భారతీయ జననీ జనకులిఁక ముందైనను తమ బాలికామణులకిట్టి మాలిన్య మంటకుండఁ జేయుదురు గాక! ఉత్పథప్రతి పన్నలు గాకుండఁ గాపాడుదురు గాక! "త్యజ దుర్జన సంసర్గ"మను హితోపదేశమును తమ పుత్రికల కనునిమిషము జ్ఞాపకముఁ జేయుదురు గాక! తమ తమ గమ్యగృహాచారములను నిల్పు కొందురు గాక!

---

## గద్యము.

ఇది శ్రీ పరమేశ్వర కరుణా లబ్ధ కవితా ధురీణ శ్రీ గురువరం దర్భా జగన్నాథ సూరి చరణారవింద భక్త్యాభరణ శ్రీ వత్స గోత్ర పవిత్రి శ్రీ తెన్నేటి విద్యామాంబా- మహా దేవావధాని పుత్ర అత్తిలి నామ గ్రామ వాస్తవ్య బుధ జన విధేయ దీక్షితీయ మను తత్స మాచ్ఛిక

పర్యాయ పద నానార్థ నిఘంటు, వార్యోక్తి మంజరి, కపి కర దీపి కాద్యనేక గ్రంథ రచయిత, వేంకట దీక్షిత నామ ధేయ ప్రణీతం బైన లీలావతీ నాటక మందు లీలావతీ వరాన్వేష ణము, వివాహ విఘ్న నాశనము, బాలికా పాఠ శాలలను గురించి చర్చ, లీలావతీ కాపురము, భర్త యనుమానములు అతిథి నిగాకరణము, బహాంగబాదు వాసము, లీలావతీ పశ్చాత్తాపము, సతీత్వ ప్రకటన, మున్నగు 'బాఠశాలల చదువులా బాలికలకు!' నని సిద్ధాంతీకరించు విషయములన్నియు గల పంచాంకములు సమాప్తము.

— శ్రీ భారతీయ పతివ్రతా శిరో మణ్యర్పణ మస్తు. —

సంపూర్ణము.

---

| పే. | పం. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 1 | 3 | కకలకు | కలకు |
| 14 | 2 | పాఠి | పాఠ |
| 24 | 17 | కట్న కానుకలింత:- | గోరంత గట్నముల్ |
| 29 | 16 | నిప్పు | ఇప్పు |
| 46 | 9 | క్షత్ర్యా, క్షత్రియ్యా:- | క్షత్రియా |
| 56 | 17 | యుచ్ఛు | యుచ్చు |
| 59 | 16 | కాతారు | కాతేరు |
| 64 | 6 | నవము | నయనము |
| 66 | 23 | మిగుల | మిగల |
| 73 | 4 | పెట్టునేడే | నేడేపెట్టు |
| 80 | 18 | వృత్రాసురాంతకునికై | బ్రహ్మ యిచ్చె |
| 96 | 5 | హిసించు | హింసించు |
| 104 | 12 | యైన | యైన |

---

అంకం. 1 రంగం 6 ను విడిచినను నాటక కథా సరళి చెడదు. నటకులు దానిని వ్యవహారానుసరించి త్యజించ్యంతురు గాత!

శ్రీ తెన్నేటి వేంకట దీక్షితులు గారి యముద్రిత గ్రంథములు

## —• 2. కవికర దీపిక •—

ఇది భాషా రహస్యములకు దర్పణము. ఇందలి విషయము లకారాదిగ సమర్చంబడినందున చదువరులు దాముపలయు విషయములను సులువుగ బడయంగలరు. ఈగ్రంథమును ముద్రింపించుటకుం బూనుకొసిన దాతలకు కవులు, పౌరాణికులు, వక్తలు, రచయితలు, హరిదాసులు, మున్నగు వారి నెందరినో విశుద్ధరీతి సిద్ధపఱచి దేశభాషాభి వృద్ధులను చేయు పుణ్యము లభింపంగలదు; ఆచంద్రార్కము యశోవృద్ధి గలుగంగలదు— క్రౌనుపత్రములు 400.

## 3 పుణ్య పాప విమర్శనము.

ఈగ్రంథమును ముద్రింపించుటకుం బూనుకొనెడు దాతలకు నరులను పాపకృత్యముల నుండి విముఖులుగాం జేసి దేశోన్నతిని బునరుద్ధారణముంజేయు సుకృతము లభింపంగలదు.

## 4. ప్రవాసన త్రయము.

"అనాథో దైవరక్షక:" "బలవంతమ్‌చికిత్సయేత్"
"సంశయాత్మా వినశ్యతి" అనుప్రబోధము లిందు గలవు. ఈ గ్రంథ కృతి పతులకు దేశములో భక్త ధీర సుమతులను బెంపొందించి సుగతులరయు వారి సంఖ్య నెక్కువం జేయు పుణ్యము లభింపం గలదు—క్రౌను పత్రములు 200.

## 5. నానా నరేక్షణము.

ఇందు పలునైజములు స్పష్టీకరింపం బడినవి.

## (6) దీక్షిత జీవిత గాథ (నేటివఱకు)

## ముద్రితములై సిద్ధముగా నుండిన గ్రంథములు.

**1. ఆర్యోక్తిమంజరి** వెల రూ. 0-12-0

ఇందు ద్వాదశ గుచ్ఛంబు లకారాది క్రమమున శిష్టి క్రాంధ్ర పద్యానువాద సహితంబులైన తత్సంబంధ శ్లోకములు కారికలు గలవు. తచ్ఛ్లోకాంతర్గత సహస్రకారికల యొక్కయు శిష్టికల యొక్కయు నను బంధము లకారాదిగ నమర్పఁబడి యున్నవి. ఇది కవులు, వక్తలు, వ్యాసకర్తలు, పౌరాణికులు, హరిదాసులు, ధర్మాచరణ తత్పరులు వీరువారననేల సర్వులకు మిత్రుని వలెను గురువు వలెను తోడ్పడును, కనుక కరదీపిక.

**2 శనిగ్రహ దండకము** వెల 0-1-0

శనిప్రసాద లబ్ధికి సులభమార్గ మేర్పఱుప నెంచి రచించిన ఈదండకమును నిత్యము సద్భక్తితోఁ బఠించు వారికి ఎల్లనాటి దుఃఖోప శమనమై సుఖము సేకూఱఁగలదు.

**3 గోదావరీ దండకము** వెల రు 0-0-6

గోదావరీమహాత్యమును నిత్యము పఠించిన తన్నదీ తీరవాసులు కృతజ్ఞులయి పునీతులగుదురు.

**4. గోదావరీ మహాత్యము** వెల 0-1-0

గోదావరీనది పుట్టుక, పాయలు, సాగరసంగమము ,పుష్కరము,పుణ్యతీర్థములు,స్నానఫలితములుమున్నగునంశములుగలవు.